# గ్రంథాలయ వర్గీకరణ

## (D D C 19 - ప్రయోగ దీపిక)


డాక్టర్ వెలగా వెంకటప్పయ్య

సంపాదకులు

పాతూరి విజయకుమార్

తిరుమలశెట్టి నరసింహారావు



ప్రతులకు

న్యూ స్టూడెంట్ బుక్ సెంటర్

అరండల్ పేట, గుంటూరు—2

అనంత శాస్త్రం బహు వేదితవ్యం
స్వల్పశ్చకాలో బహువశ్చ విఘ్నాః
యత్సార భూతం తదుపాసితవ్యం
హంసోయథాక్షీర మివాంబు మిశ్రమ్

ఉత్తర గీత

శాస్త్రాలా అనంత మైనవి. కాలం తక్కువ. విఘ్నాలు జాస్తి. కనుక అన్నీ తెలుసుకోలేం, హంస నీటిని విడిచి పాలను తాగినట్లు, కావలసిన విషయాలనే మనం తెలుసుకోవాలి, అదే వర్గీకరణలో మూల సూత్రం.

## ఈ రచయిత కొన్ని రచనలు

1 గ్రంథాలయ విజ్ఞానం 2వ, ముద్రణ 1964
2 గ్రంథాలయ పరిభాష 1984
3 గ్రంథాలయ వర్గీకరణ 3వ, ముద్రణ 1987
4 గ్రంథాలయ సూచీకరణ 3వ, ముద్రణ 1987
5 వర్గీకరణ నియమాలు 1970
6 గ్రంథకర్త గుర్తులు 1970
7 విషయ శీర్షికలు 1976
8 సమాచార విజ్ఞానం 1972
9 తెలుగులో రెఫరెన్సు గ్రంథాలు 1985
10 ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ చట్టం 1985
11 ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయోద్యమం 2వ, ముద్రణ 1986
12 ఇంటింటా గ్రంథాలయం, 1975
13 గ్రామీణ గ్రంథాలయం, 1975
14 గ్రామీణ గ్రంథాలయ నిర్వహణ 1986
15 పుస్తకాల భద్రత, 2వ, ముద్రణ 1976
16 లెనిన్ గ్రంథాలయ విధానం, 1986
17 సోవియట్ గ్రంథాలయాలు, 1987
18 ప్రసిద్ధ గ్రంథాలయాలు, 1976
19 మన గ్రంథాలయాలు, పరిశోధనాకేంద్రాలు. 1986
20 గ్రంథ సూచీ విజ్ఞానం, 1986
21 గ్రంథాలయ వేదం, 1987
22 గ్రంథాలయ పితామహ అయ్యంకి వేంకట రమణయ్య, 1983
23 గ్రంథాలయ కార్యకర్తలు 1986
24 గాంధీజీ శతజయంతి సూచిక (1920-1976)
25 సమాజ శాస్త్ర గ్రంథసూచి (1800-1976)
26 శాస్త్రీయ వాఙ్మయ సూచిక (1867-1965)
27 గ్రంథాలయ వాఙ్మయ సూచి 1982

# ముందు మాట

ప్రపంచ వ్యాప్తంగా దశాంశ వర్గీకరణ పథకం గత ఐదారు దశాబ్దాలుగా మన రాష్ట్రంలో అమలులో ఉంది. ఈ సుదీర్ఘ కాలంలో గ్రంథాలయ చట్ట పరంగా పౌర గ్రంథాలయాలు, జూనియర్, డిగ్రీ కళాశాలల్లో గ్రంథాలయాలు అపారంగా వెలిశాయి. ఈ గ్రంథాలయాలన్నిటిలో ఎక్కడో ఒకటి, రెండు చోట్ల తప్ప అన్నిటా దశాంశ వర్గీకరణ పథకమే అమలులో ఉంది. ఈ గ్రంథాన్ని ముఖ్యంగా పై గ్రంథాలయాలను, గ్రంథాలయ శాస్త్రంలో డిగ్రీ సర్టిఫికెట్ స్థాయి విద్యార్థులను దృష్టిలో ఉంచుకొని వారి ఉపయోగార్థం తయారు చేశాను.

ఈ గ్రంథానికి మూలం మెల్విల్ డ్యూయీ రూపొందించిన దశాంశ వర్గీకరణ పథకం 19వ, సంస్కరణ. మూల గ్రంథాన్ని అర్థం చేసుకోడానికి ఈ పుస్తకం చాల వరకు ఉపయోగపడుతుంది. ఒక విధంగా ఈ గ్రంథాన్ని "కంపానియన్ వాల్యూమ్" అనచ్చు. దశాంశ వర్గీకరణ పథకాన్ని సుబోధకంగా పరిచయం చేయడం ఈ గ్రంథ రచనా లక్ష్యం.

ఇంటర్, డిగ్రీ స్థాయిలో ఉపయోగించే తెలుగు అకాడమి గ్రంథాలు, మరికొన్ని గ్రంథాలు ఉదాహరణలుగా ఇచ్చాను. ఏదైనా అనుమానం వస్తే మూల గ్రంథం, దానికి అనుబంధంగా ఉన్న "మాన్యుయల్" చూడడం మంచిది. సొంత నిర్ణయాలు చేయడం యోగ్యమైన పనికాదు.

దశాంశ వర్గీకరణ పథకాన్ని యథాతథంగా అనువాదం చేయడం సాధ్యమయ్యేపనిగాదు. ఆ పథకాన్ని అద్దంలో హిమాలయాలను చూపినట్లు చేసిన ప్రయత్నం మాత్రమే ఈ గ్రంథం.

గ్రంథాలయంలో క్రమ బద్ధమైన అమెరికకు వర్గీకరణ సంఖ్యలు చాలవు. దీనికి అనుబంధంగా గ్రంథకర్త గుర్తులను (ఆథర్ మార్క్స్) చేర్చుకోవాలి. అప్పుడే సమగ్రమైన పరిచయ సంకేతం ఏర్పడుతుంది. ఈ గ్రంథంలో తెలుగు పుస్తకాలకు, భారతీయ భాషలకు అన్వయించడానికి వీలైన "గ్రంథకర్త గుర్తుల" విధానం 25వ, అధ్యాయంలో చేర్చడం జరిగింది. ఇదొక ప్రత్యేకత. ఈ గుర్తులు గత రెండు దశాబ్దాలుగా మన రాష్ట్రంలో పౌర గ్రంథాలయాలలో వాడుకలో ఉన్నాయి.

ఈ గ్రంథానికి సంపాదకత్వం వహించిన మిత్రులు పాతూరి విజయకుమార్, తిరుమలశెట్టి నరసింహారావు ఎంతో శ్రమతీసుకొని అనేక సూచనలు చేసి, సవరణలు చేర్చి ఈ గ్రంథానికి ఎంతో నిండుదనం కల్పించారు. వారికి ప్రత్యేక కృతజ్ఞతలు. వీరిద్దరి సాయం లేక పోతే ఇంత బాగా పుస్తకం బయటికి వచ్చేది కాదు. అంతేగాక ఈ రచనను ఎప్పటికప్పుడు సాపురాసి పెట్టిన సుప్రసిద్ధ గ్రంథపాలకుడు బి. ఎ. దాశరథిగారికీ, చక్కని ముఖ చిత్రం రచించిన చిత్రకారుడు "నానీ"గారికీ, ముద్రణ అందంగా పూర్తి చేసిన ప్రెస్ సిబ్బందికి, ముఖ్యంగా మేనేజర్ బ్రదర్ గ్రెగరీ గారికి కృతజ్ఞతలు తెలుపుకోవడం నా ధర్మం.

దశాంశ వర్గీకరణ పథక వినియోగం సులభతరం కావాలని చేసిన ఈ ప్రయత్నాన్ని సోదర గ్రంథపాలకులు హర్షిస్తారని నమ్ముతాను, సెలవు.

– రచయిత

# విషయ సూచిక

## పరిచయ విభాగం



## సహాయక పట్టికలు (ఆగ్జిలియరీ టేబుల్స్)



## అనుసూచీలు (షెడ్యూల్స్)

## ఇతర అవసరాలు



—0—

# 1 వర్గీకరణ : గ్రంథ వర్గీకరణ

శాస్త్రాలు అనంత మైనవి. కాలం తక్కువ. విఘ్నాలు ఎక్కువ. కనుక హంస పాలు నీరు కలిపిన మిశ్రమం లోంచి పాలను ఎలా స్వీకరిస్తుందో అలాగే మనం అనంత శాస్త్రాలను మధించి సారాన్ని గ్రహించాలని ఉత్తర గీత చెబుతోంది జీవితంలో కావలసింది ఏరు కోవడమే వర్గీకరణ.

వర్గీకరణ మనకు కొత్త విషయం కాదు. అందరికీ సుపరిచితమైనదే. అది మన నిత్యజీవితాలలో లీనమైవుంది. మనం చేసే అన్ని కార్యకలాపాల్లోను అంతర్భూతమై ఉంది. సాధారణంగా మనం వస్తువులనుగాని విషయాలను గాని లక్షణాలనుబట్టి వేరుచేస్తాం. అవసరాలనుబట్టి ఉపయోగించు కుంటాం. వేరుచేసి - ఉపయోగించే పని మనకు తెలిసి జరగవచ్చు, తెలియక జరగవచ్చు. "ఎర్రగులాబి" "నల్లకలువ" అనే రెండు పువ్వులు మన మనస్సు లోనికి వచ్చాయనుకుంటే - మిగతా వాటినుంచి ఈ రెంటినీ వేరుచేశామన్నమాట. పూల నుంచి వీటిని వేరు చేశామన్నమాట. ఇలా సదృశ లక్షణాలు గలవాటిని భిన్నలక్షణాలు గల వాటినుంచి వేరుచేయ డాన్నికావలసిదాన్ని ఎంచుకోవడాన్ని వర్గీకరణ (క్లాసిఫికేషన్) అంటారు.

దైనందిన జీవితంలో వర్గీకరణ అయాచితంగా జరిగి పోతూనే ఉంటుంది. వర్గీకరణ లేకపోతే జీవితం ముందుకు సాగదు. సజావుగా సాగదు. దీనివలన కలిగే ప్రయోజనాలు ఇలా ఉంటాయి. వర్గీకరణ వలన-

1 ఒక క్రమబద్ధమైన విధానం అలవడుతుంది,

2 అమూల్యమైన కాలం కలసి వస్తుంది.

3 అపూర్వమైన శక్తి సద్వినియోగమౌతుంది.

4 అపారమైన సంపద ప్రజావసరాలకు వినియోగపడుతుంది.

5 పని సరిగా జరుగుతుంది.

కనుక వర్గీకరణ విధానాన్ని ప్రజానీకం జీవితంలో ఆదరించక తప్పదు.

## గ్రంథాలయ వర్గీకరణ

కొందరు అనుభవనీయులు గ్రంథ పాలకుని వస్తు విక్రేతతో పోల్చారు. వస్తు విక్రేతకు ఉండే చొరవ, ఉత్సాహం గ్రంథపాలకునికి ఉండాలని వారి భావం. విక్రేత తన సరుకులను అమ్ముకోడానికి వాటిని వర్గీకరించి, ఆకర్షణీయంగా అమర్చుకుంటాడు. ఉన్నంతలో అన్నీ అందుబాటులో ఉండేట్లు, సరిదిద్దుకుంటాడు. ఈ విధంగానే గ్రంథపాలకుడు కూడా గ్రంథాలయంలోని పుస్తకాలను ఒక క్రమబద్ధమైన విధానంలో అమర్చితే గాని వాటికి సద్వినియోగం జరుగదు. ప్రతి గ్రంథాలయంలోనూ వందలూ వేల సంఖ్యలో పుస్తకాలుంటాయి. అనేక విషయాల మీద పలు గ్రంథాలుంటాయి. వీటి నుంచి మనకు కావలసిన విషయంపై గ్రంథం సత్వరం కావాలంటే వర్గీకరణ ఉండవలసిందే గదా! ఈ విధంగా పుస్తకాల నిమిత్తం ఉపయోగించే వర్గీకరణ విధానాన్ని గ్రంథాలయ వర్గీకరణ అంటారు. దీని వలన అనేక ప్రయోజనాలు లేకపోలేదు.

1 గ్రంథాలయ వర్గీకరణ వలన ఒక విషయం మీద గల పుస్తకాలు, అదే విషయానికి సంబంధం, సామీప్యం గల ఇతర విషయాలకు చెందిన పుస్తకాలు ఒక దరికి వస్తాయి. అందువల్ల ఒక విషయంపై అధ్యయనం చేసే చదువరి ఆ పుస్తకాలను సునాయాసంగా, వరుసగా పరిశీలించవచ్చు. విషయ ప్రధానంగా బోధన, సాధన జరుగుతున్న ఈ కాలంలో ఇలాంటి ఏర్పాటు ఎంతో ప్రయోజనకరంగా ఉంటుంది.

2 ఒక విషయంపై చదువరికి ఏదైనా పుస్తకం కావలసివస్తే వెంటనే తీసి ఇవ్వవచ్చు. ఆ పుస్తకాన్ని వాపసు చేసినప్పుడు సులభంగా దాని వరుస క్రమంలో సర్దవచ్చు.

3 దీనివల్ల ఒకో విషయంపై ఎన్ని పుస్తకాలుందీ తేలిగ్గా తెలుసుకోవచ్చు. పుస్తకాల ఎన్నిక సమయంలో లేని వాటిని క్రమంగా పూరించవచ్చు. ఇందువల్ల అన్ని విషయాలపై గ్రంథాలను సేకరించడానికి వీలుగా ఉంటుంది.

4 పుస్తకాలను సరిజూడడానికి, చిరిగిపోయిన పుస్తకాలు బైండు చేయించడానికి, కాలదోషం పట్టిన లేదా అవసరంలేవి పుస్తకాలు తొలగించడానికి అనువుగా ఉంటుంది. (ఇలా తొలగించిన పుస్తకాలను వేరుగా ఉంచాలి. కాని పూర్తిగా రద్దు చేయరాదు.)

5 ఏదైన ఒక విషయంపై గ్రంథసూచికలుగాని, రీడింగ్ లిస్ట్ గాని తయారు చేయడానికి, తద్వారా చదివే అలవాటును పెంచడానికి, పరిశోధనకు దోహదం చేయడానికి అనుకూలంగా ఉంటుంది.

పైగా క్రమబద్ధమైన వర్గీకరణ గల గ్రంథాలయంలో పనిజేయడానికి సిబ్బందికి ఎంతో ఆనందదాయకంగా ఉంటుంది. ఉత్సాహకరంగా ఉంటుంది. కనుకనే "వర్గీకరణ గల గ్రంథాలయం కల్పతరువు వంటిదనీ, వర్గీకరణ లేని గ్రంథాలయం మహారణ్యం వంటిదనీ" విజ్ఞులు చెప్పిన సూక్తిలో ఎంతో సత్యం కనిపిస్తుంది.

## నిర్వచనం

గత నూరు సంవత్సరాల కాలంలో గ్రంథాలయ వర్గీకరణను పలువురు విజ్ఞానులు పలురకాలుగా నిర్వచించారు. ఈ నిర్వచనాల రూపంలో కొంత భేదం ఉన్నా భావంలో అట్టే తేడా లేదు. గ్రంథాలయ వర్గీకరణకు సిద్ధాంత రీత్యా బలమైన పునాదులు వేసిన బెర్విక్ సేయర్స్ (1881-1960) దీన్ని "బీరువాలలో పుస్తకాల అమరిక లేదా చదువరులకు ఉపయోగించే విధంగా పుస్తకాల వివరణ విధానం" అన్నారు. ఇది సాధారణమైన నిర్వచనం. దీనిపై మరోమెట్టు ముందుకువేసి అమెరికాదేశ గ్రంథాలయ శాస్త్ర విజ్ఞాని మిస్ మార్గరెట్ మాన్ (1873-1950) "చదువరుల అవసరాలను బట్టి ఒక అనుకూల క్రమంలో గ్రంథాలను, అమర్చడాన్ని వర్గీకరణ" అన్నారు.

ఆ తర్వాత వర్గీకరణలో విశేషాధ్యయనం చేసిన జె.మిల్స్ గ్రంథాలనుంచి జ్ఞానసముపార్జనలో సమయాన్ని సద్వినియోగపరచే విధానాన్నే వర్గీకరణ అన్నారు. గ్రంథాలయ వర్గీకరణ విధానంపై "నభూతో నభవిష్యతి," అన్నట్లుగా కృషిచేసిన డాక్టరు ఎస్ ఆర్ రంగనాధన్ (1892-1972) గ్రంధాల అమరికను క్రమబద్ధం చేయడానికి రూపొందించిన కృత్రిమ సంకేత సమ్మేళనాన్ని వర్గీకరణ విధానం అన్నారు. ఇది సమగ్రమైన నిర్వచనం.

ఏమైనప్పటికీ చదువరులకు అధ్యయనంలో సహకరించే నిమిత్తము గ్రంథాలయంలో గల పుస్తకాల అమరికను గురించి తెలియజెప్పే క్రమ బద్ధమైన విధానాన్ని గ్రంథాలయ వర్గీకరణ అనవచ్చు. జీవకోటి మనుగడకు ప్రాణం ఎంత అవసరమో గ్రంథాలయ ప్రయోజనానికి వర్గీకరణ అంత అవసరం.

## వర్గీకరణ విషయ పరిభావం

గ్రంథాలయాలు, విద్యాలయాలు భారతదేశానికి కొత్త కాదు. ఇవి ప్రాచీన కాలం నుంచీ ఉన్నాయి. అవి పుట్టినప్పటి నుంచీ ఏదో ఒక రూపంలో ఉన్నవి. నాడు ముద్రిత గ్రంథాలు లేక పోయినా రాత ప్రతులను తమకు నచ్చిన క్రమంలో అమర్చేవారు. కొంత కాలం పాటు రాత ప్రతులలో తేడాలు అంటే రాగిరేకులు, భూర్జ పత్రాలు, తాటి ఆకులు, తోళ్ళు ఇలా వేరు వేరుగా అమర్చేవారు. మరి కొంత కాలం వాటి సైజులను బట్టి అమర్చారు. ముద్రిత గ్రంథాలు వచ్చాక కూడ చాలా కాలం వాటికి చేసిన బైండుల నమూనాలను బట్టి అమర్చే వారు.

పందొమ్మిదో శతాబ్దంలో ప్రపంచ వ్యాప్తంగా అనేక మార్పులు వచ్చాయి. పారిశ్రామిక విప్లవ ప్రభావం, విద్యాలయాల పెరుగుదల, ఆంగ్ల విద్యా ప్రాపకం, చౌక ధరలకు ముద్రిత గ్రంథాల ఉత్పత్తి విద్యా వైజ్ఞానిక రంగా లలో విప్లవాత్మకమైన మార్పులను తీసుకు వచ్చాయి. అంతవరకు ఆనందం కోసమో,కాలక్షేపం కోసమో,అలౌకిక చింతనకోసమో జరుగుతున్న చదువు

సాములు ప్రయోజనం వైపుకు మరలినాయి. తదనుగుణంగా విషయ ప్రధాన మైన అధ్యయన పెరిగింది. దానికి తగినట్లుగా వర్గీకరణ విధానం అవసర మైంది. ఇది దశాంశ పద్ధతిలో ఏర్పాటు చేస్తే అనుకూలంగా ఉంటుందని కొందరు గ్రంథాలయ విజ్ఞానులు భావించారు. అమెరికాలో బోస్టన్‌కు చెందిన నథానియెల్ బి. షట్‌లెఫ్ 1856లో ఒక ప్రయత్నం చేశారు. ప్రతి విషయానికి పది సొరుగులు ఏర్పరచారు. ఇందు దశాంశ పథకం లోని భావం సూచన ప్రాయంగా తీసుకొన్నారు. అయితే మెల్విల్ డ్యూయీ(1851-1931) దశాంశ పథకాన్ని పూర్తిగా అనుసరించి సఫలీకృతులయ్యారు. డ్యూయీ దశాంశ వర్గీకరణ పథకాన్ని 1876లో 42 పుటలలో ప్రకటించారు. ఆ తర్వాత మరికొన్ని వర్గీకరణ పథకాలు కూడ వచ్చాయి.

1 ఛార్లెస్ అమి కటర్ (1837-1903) రూపొందించిన విస్తృత వర్గీకరణ పథకం 1891లో ప్రకటించారు.

2 లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్ పాలకవర్గం 1904లో ఒక పథకాన్ని ప్రకటించారు.

3 దశాంశ వర్గీకరణ పథకాన్ని విస్తరించి, సవరణలు చేసి పాల్ ఆట్ లెట్ (1868-1938), లఫాంటైన్, డంకర్ డేవిస్ మొదలైన ప్రసిద్ధులు బెల్జియం దేశంలో 1905 లో విశ్వజనీన దశాంశ వర్గీకరణ పథకాన్ని ప్రకటించారు.

4 బ్రిటన్‌కు చెందిన జేమ్సు డఫ్ బ్రౌన్ (1862-1914) విషయ వర్గీకరణ పథకాన్ని 1906 లో ప్రకటించారు.

5 భారతదేశానికి చెందిన డాక్టరు ఎన్ ఆర్ రంగనాథన్ (1892-1972) ద్విబిందు వర్గీకరణ పథకాన్ని 1933 లో ప్రకటించారు.

6 సోవియట్ అకాడమి ఆఫ్ సైన్సెస్ తాలూకు గ్రంథాలయ విభాగం 1959 లో సోవియట్ గ్రంథాలయ వర్గీకరణ ప్రకటించింది.

7 అమెరికా దేశానికి చెందిన రైడర్ 1961లో అంతర్జాతీయ వర్గీకరణ పథకం రూపొందించారు. ఇది ప్రచారంలోకి రాలేదు.

ఎన్ని విధానాలు ఉన్నప్పటికీ దశాంశ వర్గీకరణ విధానానికున్న ప్రాపకం మరి దేనికీలేదు. ఈ విధానం 1914లో ఎ.డికిన్సన్ ప్రోత్సాహంతో భారతదేశంలో ప్రవేశించింది. ఆతర్వాత బోర్డన్, బి. ఎస్.కేశవన్ మొదలైనవారు దీనికి మరింత ప్రోత్సాహాన్నిచ్చారు. నేడు భారతదేశంలో దాదాపు 90 శాతం పైగా గ్రంథాలయాలలో ఈ పథకం అమలులో ఉంది.

భారతదేశంలోనేగాక ప్రపంచవ్యాప్తంగా ఈ విధానం అమలులో ఉంది.ఒక్క అమెరికా దేశంలో 96 శాతం పౌర గ్రంథాలయాలలో 89 శాతం కళాశాల, విశ్వవిద్యాలయ గ్రంథాలయాలలో, 64 శాతం ప్రత్యేక గ్రంథాలయాలలో ఇది ఉపయోగిస్తూ ఉన్నట్లు ఇటీవల జరిగిన ఒక పరిశీలనవల్ల తేలింది. ఈ విధానం దాధాపు యూరపు భాషలన్నిటిలోకి అనువదించారు. జాపనీస్, చైనీస్ మొదలైన కొన్ని ఆసియా భాషలలోకి అనువదించారు. హిందీ, తెలుగు, బెంగాలీ మొదలైన భాషలలోకి ఇటీవలి కాలంలో మార్చారు. దీనినిబట్టి దశాంశ వర్గీకరణ విధానపు విలువను గుర్తింపవచ్చు.

— o —

# 2 దశాంశ వర్గీకరణ

దశాంశం అంటే పదో భాగం. వర్గీకరణ అంటే ఇంతకు ముందే తెలుసుకున్నాం. దశాంశ వర్గీకరణలో ప్రతి అంశం పది విభాగాలుగా ఉంటుంది. అవసరాన్ని బట్టి మరి కొన్ని విభాగాలుగా, ఇంకా అనేక ఉప విభాగాలు చేస్తారు. ఈ విధంగా వర్గీకరణ విధానం దశాంశ ప్రాతిపదికపై నిర్మించారు. కనుక దీనికి దశాంశ వర్గీకరణ పథకం (డెసిమల్ క్లాసిఫికేషన్ స్కీమ్) అంటారు. దీని నిర్మాత అమెరికా దేశీయుడు మెల్విల్ డ్యూయీ.

## తాత్త్వికదృష్టి

వర్గీకరణ విధానాన్ని రూపొందించే ముందుగా డ్యూయీ ప్రాచీన, అర్వాచీన తత్త్వశాస్త్రాలను, లభ్యమౌతున్న ముద్రితగ్రంథాలలో విషయ స్వభావాన్ని కూలంకషంగా పరిశీలించారు. అరిస్టాటిల్, బేకన్, లాక్ మొదలైన ప్రాచీన తత్త్వవేత్తలు ; స్క్యార్ట్జ్, హారిస్ ఆదిగా గల నవీన తత్త్వవేత్తలు రూపొందించిన జ్ఞాన సిద్ధాంతాలను సమూలంగా అధ్యయనం చేశారు. వాటి అనుపానులను తెలుసుకున్నారు. అన్నిటికంటే ఫ్రాన్సిస్ బేకన్ (1561–1626) అనే బ్రిటీషు తత్త్వవేత్త 1623 లో తయారు చేసిన "ఛార్ట్ ఆఫ్ హ్యూమన్ లెర్నింగ్" వారి దృష్టిని ఎంతగానో ఆకర్షించింది. అందు గల జ్ఞాన విభజన గ్రంథాల విభజనకు గూడ సరిపోతుందని గ్రహించారు.

## డ్యూయీ పథకం

ఆమ్హరెస్ట్ కళాశాలలో సంపాదించిన అనుభవంతో డ్యూయీ, తన మిత్రుడు డబ్ల్యు ఎస్ బిస్కో సాయంతో బేకన్ నిర్మించిన జ్ఞాన క్రమానికి విలోమ క్రమంలో వర్గీకరణ పథకాన్ని రూపొందించారు. బేకన్ ఊహించిన జ్ఞాన వర్గీకరణ పథకం తొలి స్వరూపం ఇలా ఉంటుంది.

1 జ్ఞాపకశక్తి : (మెమరీ) ఇందు భూగోళ విజ్ఞానం, యాత్రలు, జీవిత చరిత్రలు, దేశచరిత్రల (900) కు సంబంధించిన విషయాలు ఉంటాయి. ఇందు వాస్తవిక విషయాలను రికార్డుచేసే అవకాశం ఉంటుంది.

2 ఆలోచనాశక్తి : (ఇమాజినేషన్) సాహిత్యం (800), లలితకళలు, కళలు(700), మొదలైన సృజనాత్మక విషయాలకు స్థానం ఉంటుంది.

3 తార్కికశక్తి : (రీజన్) సాంకేతిక విజ్ఞానం (600), శాస్త్ర విజ్ఞానం (500) భాష (400), సాంఘిక శాస్త్రాలు (300), మతం (200), తత్త్వశాస్త్రం (100) మొదలైన అంశాలు ఉంటాయి.

ఈ విధంగా బలమైన దృక్పథం, ఆలోచనా విధానంగల తాత్త్వికదృష్టితో దశాంశ విధానం రూపొందించారు. గనుకనే ఈ పథకం నాలుగు కాలాలపాటు నిలువ గలిగింది.

## ప్రత్యేక లక్షణాలు

ప్రపంచ వ్యాప్తంగా దశాంశ వర్గీకరణ పథకం ప్రచారం కావడానికి కొన్ని విశిష్ట లక్షణాలు దీనికున్నాయి. ఇందుగల సంకేత సౌలభ్యం, వ్యవహార యోగ్యత, స్మరణశీలత మొదలైన లక్షణాలే దీని ప్రగతికి కారణ మయ్యాయి,

1 సంకేత సౌలభ్యం : కేవలం అరబిక్ అంకెలతో ఏర్పాటు చేయబడిన శుద్ధ సంకేతం (ప్యూర్ నొటేషన్) అపూర్వ ప్రయోగ సౌలభ్యం గలది. ఈ సంకేతం ఉచ్చరించడానికి, గుర్తుంచుకోడానికి, టైపుచేయడానికి వీలుగా ఉంటుంది. పెంచుకోడానికి, తగ్గించుకోడానికి సౌకర్యంగా ఉంటుంది. కొత్త విషయాలు చేర్చుకోడానికి, అవసరమైనవాటిని వదలి వేయడానికి అనువుగా ఉంటుంది. క్రమబద్ధంగా ఉంటుంది.

2 వ్యవహారిక యోగ్యత : ఇది గ్రామీణ గ్రంథాలయంనుంచి విశ్వ విద్యాలయ గ్రంథాలయం వరకు ఉపయోగించడానికి వీలుగా ఉంటుంది. ఇందు విషయాలన్నీ సాధారణంనుండి నిర్దిష్టానికి - నిర్దిష్టంనుంచి మరింత నిర్దిష్టానికి విభజన చేస్తారు. అందువలన ప్రతి పుస్తకానికి, ప్రతి చిన్న విషయానికీ సముచిత స్థానం లభించడానికి వీలుంది.

3 స్మరణ శీలత్వం : (నెమోనిక్స్ లేక మెమరీ ఎయిడ్స్)
ఈ పథకంలోని సంకేత వ్యవస్థ, స్మరణశీలక సహాయకాల ఆధారంగా విషయ సంశ్లేషణ లేక వర్గ సంఖ్యల నిర్మాణం చేయడానికి అనువుగా రూపొందించబడింది. ఇందులోని 7 సహాయక పట్టికల ఆధారంగా నిర్మించిన వర్గ సంఖ్యలో, వివిధ సందర్భాలలో సమరూప అర్థాన్ని ఇస్తూ, ఇటు చదువరులు అటు సిబ్బందికి కూడా గ్రంథాలయ సేవలో తోడ్పడుతుంది.

అనుసూచీలోని కొన్ని శాస్త్రాలు లేక విషయాలు సమాంతరంగా అభివృద్ధి చెందినప్పుడు, ఒక విషయం లేక శాస్త్రం క్రింద పూర్తిగా వివరించ బడిన సంకేత శ్రేణిని సాదృశ్యాన్ని బట్టి మరొక విషయం క్రింద పునరావృత్తం చేయడానికి అవకాశం కల్పించడంద్వారా ఈ పథకం తన స్మృతి సహాయకత్వ గుణాన్ని పెంపొందించుకుంది.

4 సత్వర సంస్కరణలు : వాఙ్మయం నిరంతరం పెరుగుతూ ఉంటుంది. అనేక కొత్త విషయాలు చేరుతూ ఉంటాయి. ఈ కొత్త విషయాలను ఎప్పటికప్పుడు వర్గీకరణ పథకంలో ఇముడ్చుతూ, దానిని తాజాగా ఉంచాలి. ఇటువంటి సందర్భాలలో అప్పుడపుడు పాత విషయాలకు స్థానాలు, సంకేతాలు మారడం కద్దు. మూల సూత్రాలకు భంగం కలగనంత వరకు ఈ మార్పు ఎంతగా జరిగినా ఇబ్బంది లేదు. ఇది అభిలషణీయమైన మార్పే.

5 విషయ సామీప్యత: ఇందు సంబంధిత విషయాలన్నీ సామీప్యంలో ఉంటున్నాయి. ఒక విషయానికి సంబంధగల విషయాలన్నీ ఒకదాని వెంట ఒకటి, ఒక అనుకూల క్రమంలో ఉంటున్నాయి.

6 ఆచరణ ప్రాధాన్యం: ఇంయుగల సంకేతాలన్నీ ఉపయోగ ప్రధానంగా, ఆచరణ యుక్తంగా రూపొందించాను. దాదాపు ప్రతి సంస్కరణ తయారీ సమయంలో పదివేలకు పైగా గ్రంథాలను వర్గీకరించి, వ్యవహార యోగ్యతను గమనించాకే విడుదల చేస్తున్నారు. ఇన్ని విశిష్ట లక్షణాలు ఉండటం వలనే ఇది ఇంతగా ప్రచారమైంది. ఆచరణరీత్యా, ప్రయోజన రీత్యా, పతాకస్థాయి నందుకుంది.

## కొన్ని లోపాలు

దశాంశ వర్గీకరణ విధానం ఎంతగా ప్రచారం పొందినా అందు కొన్ని లోపాలు లేకపోలేదు. తీవ్ర విమర్శలకు గురికాక తప్పలేదు.

1 ప్రతి విషయాన్ని పది విభాగాలుగా - దశాంశ విధానానికి లోబడి విభజించడం వలన కొన్ని విభాగాలు కిక్కిరిసిపోయాయి. కొన్ని పలుచబడ్డాయి. సమత్వం కుంటుబడింది.

2 అమెరికాకు, క్రైస్తవ మతానికి సంబంధించిన విషయాలకు విశేష ప్రాధాన్యం ఇచ్చారు.

3 తూర్పు దేశాలకు, ప్రాచ్య విషయాలకు తగిన స్థానాలు, వివరణలు ఇవ్వలేదు.

4 పరస్పర సంబంధ విషయాలైన 300 సాంఘిక శాస్త్రాలు, 900 భూగోళ విజ్ఞాన చరిత్ర 400 భాష, 800 సాహిత్యం వేరు వేరుగా ఉండిపోయాయి.

5 విషయాల విభజన సమ్మతంగాలేదు. మనోవిజ్ఞాన శాస్త్రం తత్త్వ శాస్త్రం లోను, గ్రంథాలయ విజ్ఞానం సాధారణ విషయాల లోను, స్పోర్ట్సును లలిత కళలలోను చేర్చడం భావ్యం కాదు

6 ప్రస్తుత విధానం కొత్త విషయాలను చేర్చడానికి కష్టంగా ఉంటుంది.

7 పైగా తరచు జరిగే స్థానాంతరాలు వర్గీకరణకారుడిన్ని, గ్రంథాలయాన్ని ఇబ్బందులలో పెడుతున్నది.

ఈ లోపాలను సరిదిద్దడానికి 1979లో వెలువడిన 19వ సంస్కరణలో కొంతవరకు ప్రయత్నం జరిగింది. స్వల్పమైన లోపాలున్నప్పటికీ ప్రయోజనం రీత్యా ఇది అపూర్వమైన విధానం.

కాళిదాసు కుమార సంభవ మహాకావ్యంలో

అనన్తరత్న ప్రభవస్య యస్య
హిమం న సౌభాగ్యవిలోపి జాతమ్
ఏకో హి దోషో గుణసన్నిపాతే
నిమజ్జతీన్దోః కిరణేష్వివాఙ్కః

హిమవత్పర్వతం అపార సంపద గలది. రత్నాలకు, మణులకు, ఓషధులకు నిలయమైంది. అయితే అదంతా మంచుతో నిండి ఉంది గదా. అంతమాత్రాన అది పెద్ద లోటుకాదు. అలాగే చంద్రుడు మనకు చల్లని కాంతిని అందిస్తాడు. అందరిని ఆనంద పరుస్తాడు. అయితే చంద్రునిలో కనిపించే మచ్చ దాని గొప్పదనాన్ని కించపరచదు.

ఆ విధంగానే అపార ప్రయోజనంగల దశాంశ వర్గీకరణ విధానంలోగల ఈ కొద్దిపాటి లోపాలను మనం ఎంచరాదు.

డ్యూయీ రూపొందించిన దశాంశ వర్గీకరణ విధానంలో విశ్వ వ్యాప్తంగా లభిస్తున్న జ్ఞానాన్ని పది భాగాలుగా విభజించారు.

## విధాన స్వరూపం

000 సాధారణ విషయాలు
100 తత్త్వశాస్త్రం, సంబంధిత శాస్త్రాలు
200 మతం
300 సాంఘిక శాస్త్రాలు

400 భాష
500 శుద్ధ విజ్ఞాన శాస్త్రాలు
600 సాంకేతిక విజ్ఞానం
700 కళలు
800 సాహిత్యం
900 సాధారణ భూగోళ విజ్ఞానం, చరిత్ర, వాటి సహాయకాలు

డ్యూయీ జ్ఞానాన్ని తొలుత తొమ్మిది విభాగాలుచేసి, ఎందునా ఇమడ్చ నానికి వీలులేని దానిని సాధారణ విషయాల పేరున పదోవిభాగంగా ఏర్పరచారు. ఈ పదింటినీ ప్రధాన వర్గాలు అంటారు.

ఆ తర్వాత ప్రతి వర్గమూ మరల పది విభాగాలుగా చేశారు.

ఉదా :

1 500 సామాన్య విజ్ఞాన శాస్త్రాలు
510 గణిత శాస్త్రం
520 ఖగోళ శాస్త్రం, సంబంధిత శాస్త్రాలు
530 భౌతిక శాస్త్రాలు

2 940 ఐరోపా చరిత్ర
950 ఆసియా చరిత్ర
960 ఆఫ్రికా చరిత్ర

ఆ తర్వాత ప్రతి విభాగమూ మరో పది ఉప విభాగాలుగా చేశారు.

1 530 భౌతిక శాస్త్రాలు
531 యాంత్రిక విజ్ఞానం
532 ద్రవ్య విజ్ఞానం

2 950 ఆసియా చరిత్ర
951 చైనా
952 జపాన్
953 అరేబియన్ ద్వీపకల్పం, సమీప ప్రాంతాలు
954 దక్షిణ ఆసియా—భారత దేశం

ఆ తర్వాత అవసరాన్నిబట్టి మరో పది విభాగాలు చేశారు. ఈ విధంగా ఎన్ని విభాగాలైనా చేశారు. మొదటి మూడు అంకెల తర్వాత మాత్రం డెసిమల్ పాయింట్ పెట్టారు. ఈ విధంగా విషయ వర్గీకరణపు సంకేతాలు 000 నుండి 999 వరకు సాగిపోతాయి. అదే దశాంశ వర్గీకరణ విధాన మూల సూత్రం.

— ० —

# 3 19వ, సంస్కరణ ప్రత్యేకత

విశ్వజనీన విజ్ఞానంలో నిరంతరం వెలుగులోనికి వస్తున్న కొత్త విషయాలను చేర్చుకుంటూ–అవసరమైన ప్రతిసారి పరిష్కరణ జరగడం, దశాంశ వర్గీకరణ పథక ప్రత్యేకత. 1876లో 842 పుటలతో ప్రారంభమైన ఈ పథకం, 1931లో మెల్విల్ డ్యూయీ మరణించే నాటికి 12 సంస్కరణకు చేరుకుంది. తొలి సంస్కరణ తదుపరి నూరేళ్ళ పిదప వెలువడిన 19వ, సంస్కరణలో సుమారు మూడు వేల పుటలకు చేరుకుంది.

15వ, సంస్కరణ వరకు ఒకే ఒక సంపుటంలో నడిచిన ఈ పథకం 16, 17 సంస్కరణకు రెండు సంపుటాలలోనూ 18వ, సంస్కరణ నుంచి మూడు సంపుటాలలో తీర్చిదిద్దుకుంది.

మొదటి సంపుటం : ఉపోద్ఘాతం, పరిభాష, మౌలిక విభాగాలు, సంస్కరణ స్వభావం, ఉపయోగించడానికి సూత్రాలు, సహాయక ఉప విభాగాలు మొదలగునవి.

రెండో సంపుటం : దశాంశ పథక విభాగాలు.

మూడో సంపుటం : అనుక్రమణిక, అనుక్రమణిక ఉపయోగానికి సూచనలు, సంగ్రహణలు ఉన్నాయి.

గత నూరేళ్ళ కాలంలో వర్గీకరణ పథకం పెరిగిన తీరు ప్రక్క పుటనుబట్టి తెలుస్తుంది. ఈ పథకం అత్యంత ప్రయోజన కరంగా, సార్వజనీనంగా ఉండాలనే – సంపాదకుల పట్టుదల, తాపత్రయం చెప్పక చెబుతుంది.

| సంస్కరణ సంఖ్య | సంవత్సరం | పుటల సంఖ్య | | | | ముద్రించిన ప్రతులు |
|---|---|---|---|---|---|---|
| | | ప్రస్తావన | అనుసూచీ | అనుక్రమణికలు | పుటలు | |
| 1 | 1876 | 12 | 12 | 18 | 42 | 1000 |
| 2 | 1885 | 66 | 162 | 86 | 314 | 500 |
| 3 | 1888 | 4 | 227 | 185 | 416 | 500 |
| 4 | 1891 | 41 | 234 | 191 | 466 | 1000 |
| 5 | 1894 | 41 | 235 | 191 | 467 | 2000 |
| 6 | 1899 | 41 | 260 | 210 | 511 | 7600 |
| 7 | 1911 | 48 | 470 | 324 | 792 | 2000 |
| 8 | 1913 | 48 | 462 | 340 | 850 | 2000 |
| 9 | 1915 | 48 | 465 | 342 | 856 | 3000 |
| 10 | 1919 | 48 | 517 | 374 | 940 | 4000 |
| 11 | 1922 | 61 | 551 | 376 | 988 | 5000 |
| 12 | 1927 | 67 | 683 | 491 | 1243 | 9340 |
| 13 | 1932 | 75 | 902 | 670 | 1647 | 9750 |

## 1 విస్తృతీకరణ

19వ, సంస్కరణలో 4892 పద్ధుల విస్తృతీకరణ జరిగింది, 18వ సంస్కరణలో 3,387 విస్తృతీకరణలు జరిగాయి. ప్రస్తుత సంస్కరణలో మొత్తం పద్దుల సంఖ్య 29, 528 ఉంటే, గత సంస్కరణలో 26, 141 మాత్రం ఉన్నాయి.

## 2 విశ్లేషణ సంశ్లేషణ వైపు మొగ్గు

సహాయక ఉప విభాగాలకు, విషయాలను తగినంత హెచ్చుగా చేర్చడం ద్వారా వర్గీకరణ పథకాలకి అవసరమైన సంశ్లేషణ విధానం హెచ్చు స్థాయిలో అమలు చేయడం జరిగింది. వర్గీకరణ పథకం నిర్దిష్టమైన జాబితాల మార్గం నుండి విశ్లేషణాత్మక, సంశ్లేషణాత్మక పథంలోకి పయనించడం అభిలషించదగిన విషయం. సహాయక ఉప విభాగాలలో 3వ,వరుసలో సాహిత్య ఉప విభాగాలకు అనుబంధంగా 3ఎ, వరుసలో మరికొన్ని ఉప విభాగాలు చేర్చడం ఒక ప్రత్యేకత.

## 3 అంతర్జాతీయ వినియోగం

అంతర్జాతీయంగా అన్ని గ్రంథాలయాలలో ఉపయోగించడానికి వీలుగా ఈ సంస్కరణను బాగా మలచడం జరిగింది. స్పెల్లింగు విషయంలో కూడ అమెరికన్ స్పెల్లింగు నుంచి అంతర్జాతీయంగా వాడుకలో గల స్పెల్లింగ్ విధానం అనుసరించడం జరిగింది.

## 4 అనుసూచీల పునర్నిర్మాణం

ప్రస్తుతంఉన్న సంస్కరణలో కొన్ని అనుసూచీలు (షెడ్యూల్స్), టేబుల్స్ పూర్తిగా పునర్నిర్మాణం జరిగింది. ఇంతకు పూర్వం సామాజిక శాస్త్రాల వర్గ సంఖ్య 301 నేడు 301-307 కు బదిలీ చేయడం జరిగింది. ఈ అనుసూచీని 1982 లో ప్రత్యేకంగా ప్రచురించడం జరిగింది. ఇంతకు

పూర్వం 324, 329 క్రింద ఉదహరించిన రాజకీయ విధానం (పొలిటికల్ ప్రోసెస్) 324 క్రిందే పునర్నిర్మాణం జరిగింది. ఇలా చేయడం వలన ఏక పక్షి ధోరణికి స్వస్తి చెప్పడం జరిగింది. ప్రపంచంలోని అన్ని రాజకీయ పార్టీలకు సమాన అవకాశం కల్పించడం జరిగింది.

## 5 స్థానాల మారు

గత సంస్కరణలో 396 స్థానాంతరాల మార్పు జరిగితే, ప్రస్తుత అనుసూచీలో 310 స్థానాల మార్పు జరిగింది. ముఖ్యంగా సాంఘిక శాస్త్రంలో 91, సాంకేతిక విభాగంలో 68 జరిగాయి.

## 6 తగ్గింపులు

ప్రస్తుత సంస్కరణలో ఇంతకాలం అమెరికన్ స్పెల్లింగులో వస్తున్న మెల్విల్ డ్యూయీ ఉపోద్ఘాతం వదలి వేశారు. వదిలేసిన అనుసూచీలు ఇంకా చేర్చే అలవాటుకు స్వస్తి చెప్పారు, విభాగించడానికి వీలైన అంశాలను పెద్దక్షరాలతో వేసే అలవాటు మానేశారు.

## 7 సంఖ్యల పునర్వినియోగం

గత పాతికేళ్లుగా వాడుకలో లేకుండా ఉన్న సంఖ్యలను మాత్రం మరల కొత్త అర్థంలో వాడుకోవచ్చుననే సూచన ఈ సంస్కరణలో ఉంది. అంటే 1952 లో వెలువడిన 15 వ, సంస్కరణ వరకు వాడిన సంఖ్యలను ఖాళీగా ఉంచే 19 వ, సంస్కరణలో కొత్త అర్థంలో వాడుకొనే వసతి కల్పించారు.

16 వ, సంస్కరణ నుంచి ఉపయోగంలో లేని 302—307 వరుస గల సంకేతాలను, 19 వ, సంస్కరణలో 301-307 వరస పునర్నిర్మించి వినియోగం లోనికి తీసుకు రావడం జరిగింది.

## 8 చేర్పులు, మార్పులు

దశాంశ వర్గీకరణ పథకం కాలదోషం పట్టకుండా ఎప్పటికప్పుడు చేర్పులు మార్పులు తెలియజేసే చిరుపొత్తాల ప్రచురణ ఒక ప్రత్యేకత. ఇలాంటివి జూన్ 1980, అక్టోబరు 1981, వింటర్ 1983, వింటర్ 1984, స్ప్రింగ్ 1985 లో వెలువడ్డాయి. దశాంశ పథకంలో చేర్చవలసిన మార్పులు, చేర్పులు ఇందు, ముందుగా తెలియ జేస్తారు. పథకానికి సంబంధించిన విధాన నిర్ణయాలు, సదస్సులు, వార్తలు తెలియ జేస్తారు.

## 9 సంయోజనాత్మక సరళి

నూరేళ్ళ గ్రంథాలయ వర్గీకరణ పథకాల చరిత్రను పరిశీలిస్తే మనకు రెండు తరహాల పథకాలు కనిపిస్తాయి. మొదటిది: గణక పథకాలు (ఎన్యూమరేటివ్ స్కీమ్) ఉదా: దశాంశ వర్గీకరణ పథకం, లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్ పథకం మొదలైనవి. రెండవది విశ్లేషణాత్మక సంయోజనాత్మక పథకం (ఎనలిటికో-సింథటిక్ స్కీమ్) ఉదా: బ్రౌన్ విషయ వర్గీకరణ, రంగనాథన్ ద్విబిందు వర్గీకరణ పథకం మొదలైనవి. ఆధునిక గ్రంథాలయ వర్గీకరణ సిద్ధాంతం, ఊహించని ప్రమాణాలలో పెరుగుతున్న నూతన విషయాలు, విషయాంశాలు, విశ్లేషణ సంయోజనాత్మక పథకాల వైపే మొగ్గు చూపుతున్నాయి.

ఈ ఛాయలు దశాంశ వర్గీకరణ పథకంలో ఇంతకు ముందే కొన్ని ఉన్నా -ముఖ్యంగా 19 వ, సంస్కరణ నుంచి దశాంశ వర్గీకరణ పథకంలో విశ్లేషణాత్మక-సంయోజనాత్మక ప్రభావం బాగా చొచ్చుకు వచ్చేసింది.

ఇది కాల ప్రభావం. ఈసంస్కరణలో విస్తృతంగాఉన్నసహాయక పట్టికలో (ఆగ్జలియరీ టేబుల్స్) ఇందుకొక బలమైన ఉదాహరణ. మరికొన్ని చోట్ల అనుసూచిలోని సంఖ్యకు మరో సంఖ్య పూర్తిగానూ, లేదా కొంత భాగం చేర్చడానికి వెసులుబాటు చూపడం జరిగింది. ఇలా చేర్చాక మొదటి మూడు అంకెల పిదప దశాంశ చిహ్నం (చుక్క) చేర్చే ఆనవాయితీ మామూలే గదా. దశాంశ వర్గీకరణ పథకంనుంచి కొన్ని ఉదాహరణలు చూద్దాం.

1 అనుసూచీలోని సంఖ్యకు, అనుసూచీలోని పూర్తి సంఖ్యను చేర్చడం. ఉదా:

016.5 విజ్ఞాన శాస్త్రాల గ్రంథ సూచి

ఇది ఎలా వచ్చిందంటే 016 విషయ గ్రంథ సూచి. దీనికి అనుసూచిలోని శాస్త్రీ విజ్ఞానానికి గల 500 సంఖ్య చేర్చితే చాలు వర్గీకరణ సంఖ్య వస్తుంది. 016 + 500 ఈరెంటినీ దగ్గరచేర్చి చివరి రెండు సున్నాలు (ఏ వర్గ సంఖ్య అయినా దశాంశస్థానం పిమ్మట చివర అంకెగా సున్నాతో అంతం కాకూడదు కాబట్టి) తొలగిస్తే 016.5 అవుతుంది.

2 అనుసూచీలోని సంఖ్యకు, అనుసూచీ లోని మరో సంఖ్యలో కొంత భాగం చేర్చడం, ఉదా:

039.94827 తెలుగువిజ్ఞాన సర్వస్వం. ఈసంఖ్య ఎలా వచ్చిందంటే, 039 ఇతర భాషలలోని సాధారణ విజ్ఞాన సర్వస్వాలు-ఇది మూల సంఖ్య. దీనికి తెలుగు భాషా సంకేతాన్ని —94827 భాషల పట్టిక 6 నుంచిచేర్చి ఎడమ నుంచి లెక్కించి మూడు అంకెల పిదప చుక్క (దశాంశ చిహ్నం) పెడితే పై వర్గ సంఖ్య వస్తుంది.

039 + 94827 = 039.94827

3 అనుసూచీలోని ఒక సంఖ్యకు ఒకేసారి అనుసూచీలోని రెండు సంఖ్యలు చేర్చడం. 378.198 462 ఇంజనీరింగు విద్యార్థుల సంఘం. ఇందు 378 ఉన్నత విద్య—ఇది ప్రధాన విషయం—అనుసూచీలోని శ్రేణి సంఖ్య 378.196-198 విద్యార్థి ఆరోగ్యం, రక్షణ మొ.

మూలసంఖ్య 378.19 కు, వర్గశ్రేణి 371.6—371.8 లో సంఖ్య 371 తరువాత వచ్చే అంకెలను చేర్చాలి.

| 378.19 | + | —81 | + | —62 | = | 378.198 462 |
|---|---|---|---|---|---|---|
| (విద్యార్థుల ఆరోగ్యం, రక్షణ మొ॥ అంశాలు) | | నిర్దిష్ట రంగాల్లో విద్యార్థి సంఘాలు (వర్గశ్రేణి నుంచి గ్రహించ బడిన సంకేతం) | | ఇంజనీరింగ్ రంగం సంకేతం (371.84 క్రింద ఉన్న "001-999 చేర్చు" అనే సూచన అనుసరించి) | | (ఇంజనీరింగ్ విద్యార్థుల సంఘం) |

4 అనుసూచీ లోని సంఖ్యకు వరుసగా రెండు సహాయక పట్టికల నుంచి సంఖ్యలను చేర్చడం.

ఉదా: 1

323.119 141 104 2 ఇంగ్లండ్ లోని భారతీయ స్థిరనివాసులతో స్టేట్ సంబంధాలు

ఇందులో323.11 అనుసూచీ మూలసంఖ్య భారతీయ జాతి సంకేతం-91411 (ప్రజాతీయ, మానవ వంశీయ, జాతీయ సముదాయాల పట్టిక 5 నుంచి) ఇంగ్లండ్ సంకేతం-42 (ప్రాదేశిక విభాగాల పట్టిక 2నుంచి) వీటన్నింటినీ చేర్చగా —

| 323.11 | + | —91411 | + | 0 | + | —42 | = | 323.119 141 104 2 |
|---|---|---|---|---|---|---|---|---|
| (వివిధజాతులు. తెగలు) | | (భారతీయులు) | | (మూల సంఖ్య క్రింద ఇచ్చిన గమనికరీత్యా జతచేయబడినది) | | ఇంగ్లండ్ | | |

ఉదా: 2

070.088 054 బాలపత్రికా రచయితలు

| 070 | + | —088 | + | —054 | = | 070.088 054 |
|---|---|---|---|---|---|---|
| (పత్రికారచన) | | వివిధ వ్యక్తి సముదాయాలు (1 వ పట్టికనుంచి) | | బాలలు (వ్యక్తుల పట్టిక 7 నుంచ) | | |

5 ఇది దశాంశ వర్గీకరణ పథకంలో వ్యాపించి ఉన్న సంయోజన సరళి సహాయక పట్టికలో (ఆగ్జిలియరీ టేబిల్స్ 7 లో) మరింత విశదంగా కనిపిస్తుంది. ఉప విభాగాలను సరాసరి వర్గీకరణ సంఖ్యలుగా గుర్తించరాదు. వీటిని అనుసూచీ లోని సంఖ్యలకు మాత్రం చేర్చ వలసి ఉంటుంది.

| వ సం | ఉప విభాగం | ఉప విభాగ విషయం | అనుసూచీలో విషయం | వర్గీకరణ సంఖ్య |
|---|---|---|---|---|
| 1 | ప్రామాణిక ఉప విభాగాలు | – 03 నిఘంటువు | 220 బైబిల్ | 220.3 బైబిల్ నిఘంటువు |
| 2 | ప్రాదేశిక విభాగాలు | –54 భారతదేశం | 070 దిన పత్రికలు 079 ఇతర భౌగోళిక ప్రాంతాలు [దినపత్రికలు] | 079.54 భారత దేశంలో దిన పత్రికలు |
| 3 | " | –54 భారత దేశం – 41 బ్రిటన్ | 327 అంత ర్జాతీయ సంబంధాలు | 327.54041 భారత దేశ బ్రిటన్ దేశాల మధ్య అంతర్జాతీయ సంబంధాలు |
| 4 | సాహిత్య ఉప విభాగాలు | –3 నవల | 820 ఇంగ్లీషు సాహిత్యం | 823 ఇంగ్లీషు నవల |
| 5 | భాషా ఉప విభాగాలు | –5 వ్యాకరణం | 491.2 సంస్కృతభాష | 491.25 సంస్కృత వ్యాకరణం |

ఇలాగే ప్రజాతీయ, మానవ వంశీయ, భాషల, వ్యక్తుల ఉప విభాగాలు అవసరాన్నిబట్టి అనుసూచీ లోని సంఖ్యకు చేర్చడమే సంయోజన విధానం అమలు చేయడం. ఈ అంశాలపై పూర్తి వివరాలు 6–22 అధ్యాయాలలోనూ అనేక ఇతర సందర్భాలలోనూ లభిస్తాయి.

— o —

# 4 దశాంశ వర్గీకరణ పథక నిర్మాత, అసాధారణ ప్రతిభాశాలి మెల్విల్ డ్యూయీ

విశ్వవ్యాప్తమైన గ్రంథాలయ రంగంలో ఇద్దరు ప్రముఖుల పేర్లు చెప్ప వలసి వస్తే అందు మొదటి వారు మెల్విల్ డ్యూయీ, రెండో వారు డాక్టర్ రంగనాథన్. ఒకరు గత శతాబ్దంలో గ్రంథాలయ శాస్త్రానికి బలమైన పునాదులు వేస్తే, మరొకరు ఈ శతాబ్దంలో అత్యంత వైభవోపేతమైన దివ్య సౌధాన్ని నిర్మించారు విశ్వ విజ్ఞానంలో గ్రంథాలయ శాస్త్రానికి ఎనలేని గౌరవాన్ని, సుస్థిర స్థానాన్ని ఈ ఇరువురూ సంపాదించి పెట్టారు.

తొలి దశలో డ్యూయీ ఈ కృషిలో అనేక కష్టనష్టాలను భరించాడు. ఐనప్పటికీ పాతికేళ్ళ ప్రాయం వచ్చేటప్పటికే దశాంశ వర్గీకరణ విధానపు తొలి ముద్రణను ప్రకటించాడు. అమెరికన్ గ్రంథాలయ సంఘం, స్పెల్లింగ్ రిఫారమ్ అసోసియేషన్, మెట్రిక్ బ్యూరో మొదలైన మూడు జాతీయ స్థాయి సంస్థలను స్థాపించాడు. గ్రంథాలయ పత్రిక ప్రారంభించాడు. 40 ఏళ్ళ నడివయస్సు వచ్చేటప్పటికి లైబ్రరీ బ్యూరో, లైబ్రరీ స్కూలు, లేక్ ప్లాసిడ్ క్లబ్ మొదలైన సంస్థలన్నీ గ్రంథాలయోద్యమ వికాసానికి బలమైన స్థాయిని కల్పించాయి

## తొలి రోజులు

డ్యూయీ పూర్తి పేరు మెల్విల్ లూయీ కోసత్ డ్యూయీ. 1851 డిశంబరు 10వ తేదిన జఫర్సన్ కౌంటీలో జన్మించాడు. నిరుపేద కుటుంబం. తండ్రిది చెప్పులు కుట్టే వృత్తి. బాల్యంలో డ్యూయీకి ఆట్టే చదువు సాములు వంట బట్ట లేదు. చెప్పులు కుట్టడంలో తండ్రికి సాయం చేసే వాడు, ఏమాత్రం తీరిక ఉన్నా పుస్తకం తెరిచే వాడు. ఆ విధంగా

స్వయంగా కొంత చదువుకొన్నాడు. భాషపై అధికారం సంపాదించడానికి డ్యూయీ వెబ్‌స్టర్స్ డిక్షనరీ కొనాలనుకొన్నాడు. దాని వెల పది డాలర్లు. తన వద్ద అంత డబ్బు లేదు. అందు కోసం అహర్నిశలు పని జేశాడు. డబ్బు సంపాదించాడు. 11 మైళ్ళు నడచి పోయి నిఘంటువును కొనుక్కొని వచ్చాడు. డ్యూయీ పట్టుదల అలాంటిది.

డ్యూయీ బాల్యం నుంచి కష్టజీవి. స్వయంశక్తి, శ్రమ విలువ, పొదుపూ తెలిసిన వ్యక్తి. తన కుటుంబానికి ఆసరాగా ఉండేందుకు ప్రతి రోజూ కొంత సమయంలో స్టోర్సు ఆవరణ శుభ్రంచేసేవాడు. తోట పెన్నేవాడు. పొలాల్లో ఎరువును చల్లేవాడు. కుట్టు మిషన్ పై పని చేసేవాడు. ఇలా ఎన్నో పనులు చేసేవాడు.

డ్యూయీ బాల్యంనుంచీ క్రమబద్ధమైన జీవితం అలవాటు చేసుకున్నాడు. పదిహేనేళ్ళ ప్రాయం నుంచే డైరీ రాసేవాడు. తాను దర్శించిన చర్చీలు, పాల్గొన్న కార్యక్రమాలు, కలసిన మనుషులు చదివిన పుస్తకాల గురించి నిరాటంకంగా డైరీలో రాసేవాడు. బాల్యం నుంచీ కష్టించి పని చేయడం, క్రమ శిక్షణలో పెరగడం చేత మత్తుపానీయాలకి, మాదక ద్రవ్యాలకు, పొగత్రాగడానికి, ఉబుసు పోక కబుర్లకీ దూరంగా ఉండేవాడు. అ విధంగా డ్యూయీ బాల్యం గడచింది

## ఉద్యోగ ప్రవేశం

పదిహేడు సంవత్సరాల ప్రాయంలో డ్యూయీ ఉద్యోగంలో ప్రవేశించాడు. రోజుకు, 1.50డాలర్ల జీతం. అప్పటికే డ్యూయీ గ్రంథాలయంతో పరిచయం ఏర్పరచు కొన్నాడు. గ్రంథాలయంలో ఎక్కువ కాలం గడపడానికి అలవాటుపడ్డాడు. ఆతర్వాత విద్యార్థిగా అమ్హరెస్ట్ కళాశాలలో చేరాడు. ఆయన అధ్యయన విషయం గణిత శాస్త్రం. ఈ సమయంలోనే గ్రంథాలయంలో పుస్తకాల అమరికను క్రమబద్ధం చేయడానికి ఎంతో ఆలోచించాడు. 1872లో ఆ గ్రంథాలయంలో పార్ట్ టైమ్ సహాయకుడుగా ఉద్యోగం సంపాదించాడు. ఈ వాతావరణం వారి కృషికి మరింత దోహదం చేసింది, దశాంశ విధానంపైన వర్గీకరణను రూపొందించితే అది ప్రయోజనకరంగా ఉంటుందని డ్యూయీకి మెరుపులాంటి ఆలోచనతట్టింది.

## దశాంశ విధానం

డ్యూయీ దశాంశ వర్గీకరణ విధానానికి 1873 లో చిత్తు ప్రతి తయారు చేశాడు. డబ్ల్యు ఎస్ బిస్కో, సోదర సిబ్బంది తగిన విధంగా సహకరించారు. 1873 మే నెలలో తన విధానాన్ని గ్రంథాలయ పాలకవర్గానికి ఆమోదం నిమిత్తం సమర్పించాడు. పాలకవర్గం దీనిని యథాతథంగా ఆమోదించింది. డ్యూయీని ప్రోత్సహించింది. దీనిని మెరుగులు దిద్ది డ్యూయీ 1876 లో ప్రకటించాడు. అప్పట్లో పథక నిర్మాత పేరు కూడా చేర్చలేదు. తొలి ముద్రణ పేరు "A classfication and subject index for cataloguing and arranging the books and pamphlets in a library" అని ఉండేది. అప్పుడు పథకం మొత్తం 42 పుటల్లో ఉంది. 12 పుటలు ఉపోద్ఘాతం, 12 పుటలు ప్రధాన విభాగాలు, 18 పుటలు అనుక్రమణిక. అప్పటికి డ్యూయీకి 21 సంవత్సరాల వయస్సు మాత్రమే. ఈ విధానాన్ని తొలిసారిగా అమ్హరెస్ట్ కళాశాలలో ప్రవేశ పెట్టారు. ఆచరణలో ఎంతో సత్ఫలితాల నిచ్చింది. అది క్రమంగా అమెరికాలోని ఇతర గ్రంథాలయాలకు పాకింది. ప్రపంచంలోని గ్రంథాలయాలకు సైతం వ్యాపించింది. నేడు 19 వ, సంస్కరణ 1979 లో వెలువడగా అది మూడు సంపుటాలలో 3,382 పుటలకు పెరిగింది.

## 1876 ప్రాముఖ్యం

ప్రపంచ గ్రంథాలయ చరిత్రలో 1876 సంవత్సరానికి ఎంతో ప్రాధాన్యం ఉంది. ఈ ఏడాది లోనే అమెరికా దేశంలో

1 దశాంశ వర్గీకరణ పథక ప్రచురణ జరిగింది
5 అమెరికా గ్రంథాలయ సంఘం ఏర్పడింది
3 లైబ్రరీ జర్నల్ అనే మాస పత్రిక ప్రచురణ ప్రారంభమైంది.
4 స్పెల్లింగ్ రిఫార్మ్ అసోషియేషన్ ప్రారంభించడం జరిగింది.
5 గ్రంథాలయ నిర్వహణకు అవసరమైన పరికరాలను తయారు చేయడానికి, ప్రామాణీకరించడానికి లైబ్రరీ బ్యూరో అనే సంస్థను కూడా ప్రారంభించడం జరిగింది.

భవిష్యదుపయోగమూ, ప్రయోజనకరమూ- ఐన ఇన్ని మంచి పనుల వెనుక నిలచిన వ్యక్తి మెల్విల్ డ్యూయీ, ముందు తరాలకు మార్గ దర్శకుడు. జీవితాంతం అనితర సాధ్యమైన కృషి సల్పిన మహానుభావుడు.

## కొత్త ఉద్యోగం : కష్టాలు ప్రారంభం

పాలకవర్గంతో పేచీవచ్చి 1876 జూలైలో డ్యూయీ అమ్హరెస్ట్ కళాశాల వదలి పెట్టారు. బోస్టన్‌కో స్థిరపడ్డారు. పదేళ్ళపాటు ఉద్యోగం లేదు. ఆ సమయంలో వారు కాలంవృథా చేయలేదు. ప్రతి నిముషం దశాంశ వర్గీకరణ విధానానికి మెరుగులు పెట్టడానికే వినియోగించారు. దానికి ఎంతగానో రూపు రేఖలు దిద్దారు. వారుచేసిన కృషిని గమనించి 1883లో కొలంబియా కాలేజీకి ఆహ్వానించబడ్డారు. అచట 1888 వరకు గ్రంథపాలకుడుగా, గ్రంథాలయ శాస్త్ర ఆచార్యులుగా వేరువేరు పదవులు ఎంతో సమర్థతతో నిర్వహించారు. 1887లో డ్యూయీ స్థాపించిన గ్రంథాలయ శిక్షణాలయంలో ఆచార్యులుగా ఉన్నారు. శిక్షణాలయంలో ఉన్న సమయంలో డ్యూయీ అనేక ఆరోపణలకు అపార్థాలకు గురయ్యాడు. స్త్రీలను శిక్షణాలయంలో విద్యార్థినులుగా చేర్చుకుంటున్నా రనీ, సిబ్బంది చేత పనిచేయించడంలో అత్యంత కఠినంగా ఉంటున్నారనీ, ఉపాధ్యాయుల నుంచి జరిమానాలు వసూలు చేస్తున్నారనీ, ముద్రణ పనులకు తనసొంత సంస్థ లైబ్రరీ బ్యూరోను ఉపయోగిస్తున్నాడనీ, అందుకోసం పని పెంచు తున్నాడనీ—ఇలా ఎన్నో ఆరోపణలు వచ్చాయి. కొంత ఆవేశముతో కళాశాల పాలక వర్గం 1888లో డ్యూయీని ఉద్యోగం నుంచి తొలగించడానికి తీర్మానించింది. పిదప తొలగింపును సస్పెన్షన్‌గా మార్చి-డ్యూయీపైగల ఆరోపణలను విచారించడానికి ఒక దర్యాప్తు సంఘాన్ని నియమించిది. ఆ సందర్భంలో డ్యూయీ సేవలను చవిచూచిన సుమారు 40 మంది హితులకు రహస్య లేఖను పంపాడు. "Please tell me frankly whether you think I am really a man of place, or vastly better, tell me who can be had to this me enterprise" దీనిపై మిత్రులు సానుభూతి ప్రకటించారు.

చర్యాప్రు పూర్తయింది. డ్యూయీపై వచ్చిన ఆరోపణలన్నీ అభూత కల్పనలని రుజువైనాయి. కళాశాల పాలక వర్గం తమ సస్పెన్షన్ ఆర్డరును ఉపసంహరించుకున్నారు. ఇంత జరిగాక డ్యూయీ - ఆ కళాశాలలో ఉండదలచుకోలేదు. రాజీనామా చేసి ఆ కళాశాల నుంచి బయటకు వచ్చేశాడు.

## మరో ఉద్యోగం

కొలంబియా వదిలేశాక డ్యూయీ అల్బనీ చేరాడు. అచట కొంత కాలం స్టేట్ లైబ్రేరియన్‌గా పని చేశాడు. ఆ తర్వాత కొలంబియా కళాశాల పాలకవర్గం గ్రంథాలయ శిక్షణాలయాన్ని అల్బనీకి మార్చి డ్యూయీని ప్రధానాచార్యులుగా నియమించడం జరిగింది. అందాకా స్కూల్ ఆఫ్ లైబ్రరీ ఇకానమీ అని పిలుస్తున్న ఈ శిక్షణాలయాన్ని ఇక మీదట న్యూయార్క్ స్టేట్ లైబ్రరీ స్కూలుగా పిలవడానికి నిర్ణయం జరిగింది. ఈ శిక్షణాలయంలో డ్యూయీ 1926 వరకు గడిపాడు. గ్రంథాలయ శాస్త్ర బోధనలలో అనేక మార్పులను తీసుకు వచ్చాడు. గ్రంథాలయ నిర్వహణలో అనేక ప్రయోగాలను చేసి చూపించాడు. న్యూయార్కు స్టేట్ లైబ్రరీని ప్రయోగశాలగా పెట్టుకున్నాడు. చదవరులు కొంతపైకం చెల్లించి ప్రత్యేక సౌకర్యాలను పొందే అవకాశం కల్పించాడు. పార్లమెంటు సభ్యులు కోరిన సమాచారం వెంటనే అందించే ఒక నూతన విధానం ప్రవేశ పెట్టాడు. చట్టపరంగా న్యూయార్క్ గ్రంథాలయ వ్యవస్థను పటిష్టం చేయడానికి కృషిచేశాడు. గ్రంథాలయ శిక్షణలో "కేస్ స్టడీ" విధానాన్ని తొలిసారిగా ప్రవేశపెట్టాడు. సెమినార్ పద్ధతి ప్రవేశపెట్టాడు. మంచి గ్రంథాలయాలను చూడడం పాఠ్యాంశాలలో చేర్చాడు.

## పాలక వర్గంతో పేచీ

డ్యూయీ అల్బనీలో పనిచేస్తున్న సమయంలో పాలకవర్గంతో పేచీ వచ్చింది. అతనిపై కొన్ని ఆరోపణలు మోపడం జరిగింది. ముఖ్యంగా డ్యూయీ తన దశాంశ వర్గీకరణ పథకాల ప్రతులు అమ్ముతున్నారనీ,

సెకెళ్ళను టోకుగా విద్యార్థులకు అమ్మేశాడనీ, అక్రమార్జనతో ఇల్లు
్పాడనీ–ఇలాంటి ఆరోపణలను, విచారణల కమిటీ విచారించి డ్యూయీ
ేషి అని తేల్చింది. అయినప్పటికీ స్వల్పమైన లోపాలకు డ్యూయీని
ుకవర్గం అభిశంసించింది (సెన్సర్డ్). ఇటువంటి గొడవలను
కునేందుకు డ్యూయీ ప్రశాంత జీవితం గడపదలచి అల్బనీ వదలి
5లో లేక్ ప్లాసిడ్ క్లబ్ చేరాడు. "ఈ క్లబ్ ధ్యేయం ఏమంటే అనారోగ్య
కులైన గ్రంథపాలకులు మొదలైన వారికి ప్రకృతి సుందరమైన
గ్యాలమధ్య, ఆహ్లాదకరమైన వాతావరణంలో చౌకగా ఆరోగ్య
ానాలను నిర్మించి, వారికి స్వస్థత చేకూర్చడం. డ్యూయీ జీవితకాలంలో
క్లబ్‌ను బాగా అభివృద్ధి చేశాడు. 1931 నాటికి 10,600 ఎకరాలు
ాదించి, వందల సంఖ్యలో ప్రశాంతి సౌధాలు నిర్మించాడు. 1831లో
న జన్మదినోత్సవం జరుపుకొని పదకొండు దినాలకు కాలం చేశాడు.
ుథాలయ లోకంలో ఒక నక్షత్రం రాలిపోయింది.

## ్యూయీ కృషి : వ్యక్తిత్వం

్యూయీ సుదీర్ఘమైన తన జీవిత కాలంలో దశాంశ వర్గీకరణ పథక నిర్మాణం,
ుెరికన్ గ్రంథాలయ సంఘ నిర్మాణం; లైబ్రరీ ఇకానమీ; లేక్
ిడ్ క్లబ్ మొదలగు అనేక సంస్థలు ప్రారంభించి జీవితాంతం వాటి
వృద్ధికి కృషి చేశాడు. వారి సేవలకు కృతజ్ఞతా సూచకంగా 1902లో
్రఫెడ్, సైరక్యూజ్ విశ్వవిద్యాలయాలు గౌరవ పట్టాలతో అభినం
ాయి. ఒకప్పుడు వారిపై నేరారోపణ చేసి, అవమానించిన కొలంబియా
్వవిద్యాలయం వారి పేర ఆచార్య పీఠాన్ని స్థాపించి–తమను తాముగా
ివించుకున్నాయి.

్యూయీ తాము ఒకసారి ఇలా రాసుకున్నారు. "I was born with a dis-
ition which has never left me to run things whenever I could get
ıance" సాటివారితో పొసగక, పరిస్థితులతో రాజీపడలేక డ్యూయీ
క కష్టాలు పడ్డాడు. మనోధైర్యంతో అన్నిటినీ ఎదుర్కొనగలిగాడు.
్యూయీ సహజంగా ఆర్థ్రహృదయం కలవాడు కావడంచేత వెంటనే–సాటి

వారికి సాయపడాలనే ఉద్దేశంతో వాగ్దానాలు చేసేవాడు. వాటిని నెరవేర్చ డానికి అష్టకష్టాలు పడేవాడు. కర్తవ్యపరాయణులకు, త్యాగధనులకు ఈ కష్టాలు తప్పవు. డ్యూయీ అమరజీవి. దశాంశ వర్గీకరణ విధానం ఉన్నంత కాలం డ్యూయీ సజీవుడే. డ్యూయీ దీక్షను గురించి ఫుట్మన్ ఇలా చెప్పారు. "డ్యూయీ హోంచేస్తున్నా. త్రాగుతున్నా, నిద్రిస్తున్నా, మాట్లాడుతున్నా_గ్రంథాలయ విషయాలే ఆలోచిస్తుంటారు. అది ఒక సారి కాదు, ఒకనిమిషంకాదు-ఒకగంటకాదు. ఒక రోజుకాదు- వారాలు, మాసాలు-సంవత్సరాలు అలాగే గడిచిపోతాయి. అంతకంటే డ్యూయీని గురించి ఏంచెప్పగలం."

భౌతికంగా డ్యూయీ మనకు దూరమైనా గ్రంథాలయాలు ఉన్నంతకాలం వారి పేరు చిరస్థాయిగా నిలచే ఉంటుంది. అంతకు మించి జన్మ సార్థకత్వం ఏముంటుంది.

— o —

# 5 వర్గీకరణ నియమాలు

వర్గీకరణ క్రమబద్ధంగా జరగవలెనంటే కొన్ని నియమాలను అనుసరింపవలసి వుంది. వర్గీకరణ విధానంలో ఎంత క్షుణ్ణమైన పరిజ్ఞానం ఉన్నప్పటికీ నియమాల ఆచరణలో మెలకువ లేకపోతే అదంతా అడవిగాచిన వెన్నెల అవుతుంది. ఈ విధానాన్ని ఉపయోగించడాన్ని గురించి 19 వ.సంస్కరణలో దశాంశ వర్గీకరణ సంపాదక వర్గం కొన్ని నియమాలను సూచించారు. అంతకు ముందు మెర్రిల్ ఒక నియమావళిని తయారుచేశారు, మన చదవరులను దృష్టిలో ఉంచుకొని ఈ నియమాలను ఆచరణలో పెట్టవలసి ఉంది. అవసరమైన మౌలిక సిద్ధాంతాలకు విరుద్ధంలేని విధంగా తగిన స్వల్పమైన మార్పులు చేసుకోవలసి వుంది.

## విషయపు గుర్తింపు

నేడు విజ్ఞాన శాఖలలో ప్రగతి విస్పష్టంగా కనిపిస్తుంది. తదనుగుణంగా ప్రతివిషయంలోనూ వందలు, వేల సంఖ్యలో పుస్తకాల ముద్రణ జరుగుతున్నది. విషయ ప్రధానమైన అధ్యయన పెరిగింది. దీని ననుసరించే వర్గీకరణ విధానాలు అమలులోకి వచ్చాయి. విషయ ప్రధానమైన వర్గీకరణ జరుగవలసినప్పుడు గ్రంథపాలకుడు పుస్తకంలో చెప్పబడిన మూల విషయం, గ్రంథకర్త ఉద్దేశం గమనించాలి. పుస్తకాన్ని చూడగానే చాల సందర్భాలలో ఇది బోధపడదు. అందు నిమిత్తం గ్రంథవాలకుడు వరుసగా ఈ క్రమాన్ని పాటించవలసి ఉంటుంది.

1 వర్గీకరణ నిమిత్తం గ్రంథపాలకుడు పుస్తకంలోని విషయాన్ని తెలుసుకోవాలంటే ముందుగా ముఖ పత్రాన్ని పరిశీలించ వలసి ఉంటుంది. చాల సందర్భాలలో ముఖపత్రంమీది నామం గ్రంథస్త

విషయాన్ని తెలుపుతుంది. అప్పుడప్పుడు ఉపనామంకూడ గ్రంథ విషయాల్ని వ్యక్తీకరించే సందర్భాలు లేక పోలేదు. ఇందు ముఖపత్రాన్ని మాత్రమే ప్రధాన ఆధారంగా తీసుకొనరాదు.

2 గ్రంథంలో వివరించిన అంశాలపైనే విషయసూచిక ఉంటుంది. కనుక విషయసూచిక కూడ గ్రంథంలోని విషయాన్ని తెలుసుకోడానికి ఉపయోగిస్తుంది. అప్పటికీ విషయం అస్పష్టంగా ఉంటే-

3 గ్రంథ పరిచయం, పీఠిక, సంపాదకీయం మొదలైనవాటిని పరిశీలించ వలసి ఉంటుంది.

4 అప్పటికీ మూల విషయం పూర్తిగా బోధపడకపోతే పుస్తకాన్ని అక్కడక్కడా చదవవలసి ఉంటుంది. అనుక్రమణికను గూడ పరిశీలించవలసి ఉంటుంది.

5 వర్గీకరింపవలసిన గ్రంథం ఏదైనా మాల (సీరీస్)లో ప్రచురిస్తే, ఆ మాలను (సీరీస్) బట్టి లేదా అందు యింతకు ముందు ప్రచురించిన గ్రంథాలనుబట్టి గ్రంథస్థ విషయాన్ని కొంత తెలుసుకోవచ్చు.

6 గ్రంథస్థ విషయం తెలుసుకోడానికి మరో ఆధారం ఉంది. అదే మూపు అట్ట (బుక్ జాకెట్). దీని మీద విషయం గ్రంథాన్ని గురించీ, గ్రంథ కర్తను గురించి ప్రశంసాత్మకంగా ఉన్నప్పటికి విషయ వివరణ ఎంతో కొంత స్పష్టంగా ఉంటుంది.

కొన్ని ప్రత్యేక సందార్భాల్లో అప్పటికి గ్రంథస్థ విషయం బోధపడక పోవచ్చు. రచయిత దృక్పథం తెలియక పోవచ్చు. అప్పుడు గ్రంథపాలకుడు ఈ దిగువ సమాచార గ్రంథాలను (రెఫరెన్స్ బుక్స్) కూడ పరిశీలించవలసి ఉంటుంది.

1 జాతీయ గ్రంథ సూచీలు
2 వివరణాత్మక గ్రంథ సూచీలు
3 ప్రసిద్ధ గ్రంథాలయాల సూచీలు
4 గ్రంథ సమీక్షలు

ఈ పరిశీలన కొంత శ్రమతో కూడుకున్నప్పటికీ స్పష్టమైన విషయ పరిగ్రహణకు తోడ్పడుతుంది. విషయ నిర్ణయంలో సుమారు నిర్ణయం అంత మంచిది గాదు. ప్రతిసారి నిశితంగానూ, హేతుయుక్తంగానూ తర్కించుకొన్నాకనే తుది నిర్ణయానికి రావాలి.

సందేహమనేది ఏకాస్త ఉన్నా దాన్ని వదిలి వేయరాదు. మరి కాస్త శ్రమైనా, ఆలస్యమైనా విషయాన్ని తెలుసుకోవాలి. చదువరికి న్యాయం కలుగజేయాలి. అందుకోసం వెనుకంజ వేయరాదు. గ్రంథపాలకుడు కూడ తెలుసుకోవలసిన విషయాలెన్నో ఉంటాయి.

అటువంటి సమయాల్లో విషయ నిర్ణయానికి గ్రంథపాలకుడు ఆయా విష-యాలలో ప్రసిద్ధులైన విజ్ఞానులను. పండితులను సంప్రదించాలి. అవసర మైతే గ్రంథ రచనకు కారణభూతులైన రచయితను, రచయిత లభ్యం కాకుంటే వారి అనుయాయులను, అభిమానులను సంప్రదించాలి. అంతకు మించి విషయ వివేచనకై చేయవలసిన ప్రయత్నం ఉండకపోవచ్చు.

వర్గీకరణ చేసేప్పుడు గ్రంథపాలకుడు మరో విషయాన్ని గుర్తుంచు కోవాలి, హెచ్చువాడుకలో ఉండేవి, చదువరులకు అత్యవసరమైనవి. సులభంగా వర్గీకరించడానికి వీలైన పుస్తకాల పని ముందు చూడాలి. ఆ తర్వాత మిగతావాటి విషయం చూడాలి. ఇలా చేయడంవల్ల చదువరులకు హెచ్చుగా తోడ్పడటానికి అవకాశముంటుంది.

## విధాన పరిశీలన

వర్గీకరణ చేయదలచిన గ్రంథపాలకుడు ముందుగా వర్గీకరణ విధానంపై సమగ్రమైన అవగాహన సాధించాలి. అనుక్రమణికపై ఆధారపడరాదు. ఏ విషయానికి ఏ దృష్టితో, ఏ సందర్భంలో ఏ సంకేతాన్ని ఇచ్చిందీ

స్పష్టంగా తెలుసుకోవాలి. రచయిత దృక్పథాన్ని అనుసరించి వర్గీకరణ జరగాలి. ఉపయోగించదలుచుకున్న సంకేత పూరిత వివరణ తెలుసుకోవాలి. 954.84 ఉపయోగించ దలుచుకున్నప్పుడు అవరోహణ క్రమంలో దాని అనుపానులను తెలుసుకోవాలి.

954.84 ఆంధ్రప్రదేశ్ చరిత్ర
954.8 దక్షిణ భారత చరిత్ర
954 భారతదేశ చరిత్ర
950 ఆసియా చరిత్ర
900 చరిత్ర

## కొండవీటి చాంతాడు సంఖ్యలు

దశాంశ వర్గీకరణ పథక నిర్మాణ రీత్యా కొన్ని సందర్భాలలో గ్రంథాలయం లోని విషయానికి పూర్తి న్యాయం చేకూర్చగల సంఖ్యలను రూపొందించడం కష్టం. తగిన ప్రయత్నం చేస్తే ఒకోసారి సాధ్యం కావచ్చు. అలా సాధ్యం చేస్తే కొన్ని విషయాల వర్గీకరణ సంఖ్యలు ఇలా ఉంటాయి

1 స్వాతంత్ర్యం వచ్చాక భారతదేశ పట్టణ ప్రాంతాలలోని గుమాస్తాల ట్రేడు యూనియన్ల స్థితి 331.881 165 109 540 097 320 4

2 భారత దేశ అడవులలో వేట 799.295 400 952

3 కామన్ వెల్త్ యూనివర్సిటీస్ ఇయర్ బుక్ 378.002 517 124 1

4 ఆంధ్రప్రదేశ్‌లో స్వాతంత్ర్యానంతరం సినిమా టిక్కెట్లపై పెరిగిన పన్నులు 336.278 791 430 954 8404 ఇలా కొండవీటి చాంతాడులాగా అంకెలను పెంచడం న్యాయంకాదు. వర్గీకరణ సిబ్బందికి, చదవరులకు ప్రయోజనకారిగా ఉండాలే గాని, వారిని ఇబ్బంది పెట్టరాదు. పౌర గ్రంథాలయాలు తమ వర్గీకరణ సంఖ్యలను 6-8 లోపు సంఖ్యలకు మించకుండా ఉంటే ఆచరణ యోగ్యంగా ఉంటుంది.

ఈ విధంగా ఒక అవగాహనకు వచ్చాక కొన్ని నియమాలను అనుసరిస్తూ వర్గీకరించవలసి ఉంటుంది.

## నియమాలు

చదువరికి ఉపయోగ ప్రధానంగా గ్రంథాన్ని వర్గీకరించాలి. గణితశాస్త్రం పద్యరూపంలో రచింపబడినప్పటికీ చదువరి ప్రయోజనం నిమిత్తం దానిని గణిత శాస్త్రంలోనే వర్గీకరించాలి. చేసిన వర్గీకరణను తరచు సమీక్షిస్తూ ఉండాలి. వర్గీకరణ నిమిత్తం కొన్ని నియమాలు ఈ దిగువ ఉన్నాయి.

1 సాధారణ విజ్ఞాన సర్వస్వాలు, వ్యాసాలు, సాహిత్య ప్రక్రియలైన కావ్యాలు, నాటకాలు, నవలలు మొదలైన వాటిని రూప ప్రధానంగా వర్గీకరించాలి. తెలుగు విజ్ఞాన సర్వస్వం, ఆంధ్ర మహాభారతం మొదలగు వాటిని విషయం ప్రధానంగా తీసుకోరాదు. రూపం ప్రధానంగా తీసుకోవాలి.

2 తత్త్వశాస్త్రం, మతం, సామాజిక శాస్త్రాలు, విజ్ఞాన శాస్త్రాలు, కళలు చరిత్ర మొదలైన భాషా, సాహిత్యేతర గ్రంథాలను విషయ ప్రధానంగా వర్గీకరించాలి.

3 అవసరమైనపుడు విషయ పరిపూర్ణతకోసం ప్రామాణిక ఉప విభాగాలు (స్టాండర్డు సబ్ డివిజన్స్) ఉపయోగించాలి.

4 విషయ వివరణలో భౌగోళిక పరిధి ఉన్నట్లయితే, అనుబంధ సంకేతాలలో వివరించిన సంకేతం చేర్చాలి.

5 ఒక గ్రంథంలో రెండు విషయాలు వివరించినట్లయితే, అందు ప్రధానంగా చర్చించిన వర్గ సంకేతాన్నివ్వాలి.

6 ఒక గ్రంథంలో రెండు విషయాలు సమాన స్థాయిలో చర్చించి నప్పుడు–అందు మొదటి విషయానికి వర్గ సంకేతాన్నివ్వాలి.

7 ఒక గ్రంథంలో రెండు లేదా, అంతకంటే ఎక్కువ విషయాలు వివరింపబడినప్పుడు - అన్నిటినీ కలిపే మూల విషయానికి వర్గ సంకేతాన్నివ్వాలి.

8 ఒక విషయంపై - మరొక విషయపు ప్రభావం పడ్డప్పుడు ఆ ప్రభావాన్ని స్వీకరించిన విషయాన్ని ప్రధానంగా తీసుకోవాలి.

9 అభినందన సంచికలు, సన్మాన సంచికలు, సంస్మరణ సంచికలకు ఆ సంచికలలో చర్చించిన విషయాన్ని ప్రధానంగా తీసుకోవాలి.

10 ఒక పత్రిక పేరు కొంతకాలానికి మారవచ్చు. అందుగల విషయాలలో మార్పు రావచ్చు, ఐనప్పటికీ తొలి సంపుటానికిచ్చిన వర్గ సంకేతాన్నే తర్వాత కొనసాగించాలి,

11 సాహిత్య ప్రధాన రచనల అనువాద గ్రంథాల విషయంలో మూల భాషకే వర్గ సంకేతాన్నివ్వాలి. విషయ ప్రధానమైన తత్త్వ శాస్త్రం, మతం, సామాజిక శాస్త్రాలు-ఆదిగా గల రచనలలో విషయానికి మాత్రం వర్గ సంకేతాన్నివ్వాలి.

12 గ్రంథ సూచికలను వాటి స్వరూపాన్ని బట్టి వర్గీకరించాలి,

13 కర పత్రాలు, చిరుపొత్తాలు విషయాల వారీగానే వర్గీకరించవలసి ఉంటుంది. కాని ఏదైనా రాజకీయపార్టీ విడుదల చేసే కరపత్రాలకు. పార్టీ పేరుగల సంకేతాన్ని ఇవ్వాల్సి ఉంటుంది.

14 ఒక విషయంపై గల గ్రంథాలతో బాటు-దానిపైగల విమర్శాత్మక ప్రశంసాత్మక రచనలను ఒక చోట మాత్రమే వర్గీకరించవలసి ఉంటుంది. ఇది పరిశోధకులకు ఎంతో ప్రయోజనకరంగా ఉంటుంది.

15 బాల సాహిత్యాన్ని ఇంతకు ముందు వివరించిన నియమాల ప్రకారమే వర్గీకరించాలి. వర్గ సంకేతంపై 'బా' అను సంకేతాన్ని చేర్చితే బావుంటుంది.

## మరికొన్ని సూచనలు

మొత్తంమీద పై నియమాలు పాటించేప్పుడు ఈ దిగువ సూచనలు గమనికలో ఉంచుకోవాలి.

1 గ్రంథాలయ స్థాయినిబట్టి వర్గీకరించాలి.

2 వర్గీకరణ సమతూకంలో ఉండాలి.

3 వర్గీకరించిన గ్రంథాల ఉపయోగాన్ని తరచు సమీక్షిస్తూ ఉండాలి.

4 వర్గీకరణ విధానం నూతన సంస్కరణలో వచ్చే మార్పులను కూడ ఎప్పటి కప్పుడు వీలున్నంతవరకు, అవసరాన్నిబట్టి అమలు పరచాలి.

5 పుస్తకాల వెన్నుమీద తప్ప అన్నిచోట్ల పరిచయ సంకేతాన్ని పెన్సిల్‌తో మాత్రం వేయాలి.

ఈ విషయాలుకూడ నిత్యం దృష్టిలో ఉంచుకొన్నట్లయితే వర్గీకరణ కార్యక్రమం మరింత ప్రయోజనకరంగా ఉండటానికి వీలుగా ఉంటుంది. అదే వర్గీకరణ విధానం పరమావధి,

— ౦ —

# రెండో భాగం

## సహాయక పట్టికలు

## (ఆగ్జిలియరీ టేబుల్స్)

పట్టిక 1 : ప్రామాణిక ఉప విభాగాలు

పట్టిక 2 : ప్రాదేశిక విభాగాలు

పట్టిక 3 : సాహిత్య ఉప విభాగాలు

పట్టిక 4 : భాషా ఉప విభాగాలు

పట్టిక 5 : ప్రజాతీయ, మానవ వంశీయ, జాతీయ సమూహాలు

పట్టిక 6 : భాషలు

పట్టిక 7 : వ్యక్తులు

## పరిచయం

వర్గీకరణ విధానంలో ప్రధాన విషయానికి తగినంత సమగ్రతను చేకూర్చేందుకు అవసరాన్ని బట్టి మరికొన్ని ఉప విభాగలను చేర్చవలసి ఉంటుంది వీటిని సహాయ పట్టికలు లేక ఉప విభాగాలు (ఆగ్జిలియరీ టేబుల్స్) అనవచ్చు. 17 వ. సంస్కరణలో ఇవి రెండురకాలు మాత్రం ఉండేవి. 18వ, సంస్కరణ నుంచీ 7 రకాలకు పెరిగాయి. దశాంశ వర్గీకరణ పథకం 19 వ సంస్కరణలో సహాయక పట్టికలు లేక ఉప విభాగాలు ఏడు వరసలలో ఉంటాయి.

పట్టిక 1 : ప్రామాణిక ఉప విభాగాలు
పట్టిక 2 : ప్రాదేశిక విభాగాలు
పట్టిక 3 : సాహిత్య ఉప విభాగాలు
పట్టిక 4 : భాషా ఉప విభాగాలు
పట్టిక 5 : ప్రజాతీయ, మానవ వంశీయ, జాతీయ సమూహాలు
పట్టిక 6 : భాషలు
పట్టిక 7 : వ్యక్తులు

పేరును బట్టి ఈ పట్టికలు లేక సహాయక ఉప విభాగాలు సహాయకాలుగానే ఉంటాయి.

1 సహాయక పట్టికల సంకేతాల ముందు "—" చిన్న అడ్డు గీత (హైఫన్) విధిగా ఉంటుంది. ఏ విషయానికైనా చేర్చితే అది పోతుంది.

2 అవసరాన్ని బట్టి 000 నుంచి 999 వరకు ఏ విషయానికైనా చేర్చవచ్చు. స్వతంత్రంగా నేరుగా వినియోగించరాదు,

3 మొదటి వరస సంకేతాలు (అంటే ప్రామాణిక ఉప విభాగాలు) అన్వయిస్తే అచట చేర్చుకోవచ్చు. ముందుగా ప్రధాన విషయం నిర్ణయించాక అది అసంపూర్ణమని భావిస్తేనే ఈ ఉప విభాగాలు చేర్చాల్సి ఉంటుంది.

4 2,5,6,7 పట్టికలలోని సంకేతాలు నిర్దేశించిన చోట మాత్రం ఉపయోగించాలి.

5 3,4 పట్టికలలోని సంకేతాలు భాషలకు కొన్ని ప్రత్యేక అనుసూచీలకు (షెడ్యూల్స్‌కు) వర్తిస్తాయి.

పైన ఉదహరించిన ఏడు రకాల పట్టికలు లేక ఉప విభాగాల గురించి ఇప్పుడు తెలుసుకుందాం.

## పట్టిక 1 : ప్రామాణిక ఉప విభాగాలు

విషయ వివరణ కోసం రచయిత ఒక రచనా సరళిని ఎంచుకుంటాడు. అది సిద్ధాంత వ్యాసం గావచ్చు. పాఠ్యగ్రంథం కావచ్చు. విజ్ఞాన సర్వస్వ వ్యాసం కావచ్చు. పత్రికా రచన కావచ్చు. సంస్థ నివేదిక కావచ్చు. ఈ రూపాలు మూల విషయానికి చేర్చినపుడే ఆ విషయానికి సమగ్రత చేకూరుతుంది. ఈ ఉప విభాగాల వినియోగంలో ఈ దిగువ సూచనలు పాటించాలి.

1 వీటిని స్వతంత్రంగా ఉపయోగించరాదు. అవసరాన్ని బట్టి మూల సంకేతాలకు చేర్చాలి.

2 మూల సంకేతంలో కనీసం మూడు అంకెలుంటాయి. అందు చివరి అంకె సున్న అయినపుడు ప్రామాణిక ఉప విభాగం చేర్చితే అందు మూల సంకేతంలో చివరి సున్న తొలగించాలి.

ఉదా : 510 గణిత శాస్త్రం-ప్రధాన విషయం
-03 నిఘంటువు

ఈ రెంటిని కలుపగా—

510 + 03 = 530.3 గణిత శాస్త్రి నిఘంటువు - అవుతుంది.

3 ప్రామాణిక ఉప విభాగంలా భ్రమించే ఉప విభాగం సహజంగా సంకేతంలో ఉన్నప్పుడు, ఉప విభాగం స్పష్టంగా తెలిసేందుకు మరో సున్న అదనంగా (అంటే) మొత్తం రెండు సున్నాలు చేర్చాలి.

ఉదా : 335 సామ్యవాదము
-01 సిద్ధాంతం

335 + 01 = 335.01 సామ్యవాద తత్వం లేదా సిద్ధాంతం కావలసి ఉంది. కాని డ్యూయీ వర్గీకరణ విధానంలో 335 సామ్యవాదం అనే మూల విషయం క్రింద సున్నాతో ప్రారంభమయ్యే సంకేత విభాగం మరో ప్రయోజనం నిమిత్తం కేటాయించ బడింది. కనుక సామ్యవాద తత్వం లేదా సిద్ధాంతానికి 335 + 001 = 335.001 అనే సంకేతాన్ని వాడి రూపొందించుకోవాలి. ప్రామాణిక ఉప విభాగాల వరుస ఈతీరుగా ఉంటుంది.

4 వర్గీకరణ విధానంలో సూచించిన విధంగా కొన్ని సందర్భాలలో రెండు సున్నలు మరికొన్ని సందర్భాలలో మూడుసున్నలు కూడా చేర్చాలి

ఉదా: 320 రాజనీతి
320.5 రాజనీతి సిద్ధాంతాలు.

ఇచట వర్గసంఖ్య 320.5 ప్రామాణిక ఉప విభాగం -05 చేర్చడం వలన రూపొందించ బడలేదు. మూలంలో ఈ సంకేతం సహజంగానే ఉన్నది. ఈ పరిస్థితిలో ప్రామాణిక ఉప విభాగం చేర్చాలంటే మరో సున్న చేర్చాలి.

320 రాజనీతి శాస్త్రం
-05 పత్రికలు
320 + 05 = 320.05 (రాజనీతి శాస్త్ర పత్రిక)

5　　మూడు సున్నాలు చేర్చవలసిన సందర్భాలు-

ఉదా: 352 స్థానిక ప్రభుత్వాలు

352.005 స్థానిక ప్రభుత్వాలలో ప్రభుత్వ సర్వీసు. ఇచట 005 ప్రామాణిక విభాగంకాదు. మూలంలో సహజంగా ఉన్నదే. స్థానిక ప్రభుత్వాలకు ప్రామాణిక ఉప విభాగం చేర్చాలంటే మూడు సున్నాలు చేర్చాలి.

ఉదా: 352.000 5 స్థానిక ప్రభుత్వాలపై పత్రికలు
　　కొన్ని సందర్భాలలో నాలుగు సున్నాలు చేర్చాలి

6　　మూల విషయంలోనే ఉప విభాగం సహజంగా ఇమిడి ఉన్నప్పుడు మరల —09 ఉప విభాగం చేర్చరాదు.

ఉదా: 954 భారత దేశ చరిత్ర. ఇది అనుసూచీలోని సహజ సంకేతం. దీనికి —09 చారిత్రక ఉప విభాగంచేర్చి 954.09 అనడం తప్పు

7　　ఒక గ్రంథానికి రెండు ప్రామాణిక విభాగాలు చేర్చవలసిన అవసరం ఉంటే పట్టిక ప్రారంభంలో ఇచ్చిన ప్రాధాన్యాల క్రమాన్ని బట్టి ఒక ప్రామాణిక విభాగాన్ని ఎంచుకొని, రెండవ దాన్ని ఉపేక్షించాలి.

ఉదా: గ్రంథాలయ జ్యోతి, గ్రంథాలయ విద్యపై పత్రిక 020.7 దీన్ని 020.705 అనడం సరికాదు. (ఇక్కడ ఉపయోగించ వలసిన—05 పత్రికలు—07 అధ్యయిన, అధ్యాపన అనేరెండు ఉప విభాగాల్లో, ప్రాధాన్యాల క్రమపట్టికను అనుసరించి సంకేతము —07ను ఎన్నుకోవడమైంది).

8　　విధానం అనుమతిస్తే రెండు ప్రామాణిక ఉప విభాగాలు ఉపయోగించవచ్చు. ఉదా: 610.730 5 నర్సింగ్‌పె పత్రిక.

**ఉప విభాగాలు**

| | |
|---|---|
| –01 | తత్వం, సిద్ధాంతం |
| –012 | వర్గీకరణ శాస్త్రం లేక విషయ విభాగాలు వాటి అంతర్గత సంబంధాలు. |
| –013 | విలువ |
| –014 | పరిభాష, సంసర్గము |
| –015 | శాస్త్రీయ సిద్ధాంతాలు ఒక విషయాన్ని వివరించడానికి, ఒక విషయాన్ని వర్ణించడానికి శాస్త్రీయ ప్రవృత్తిదానుసరణ. |
| –016 | అనుక్రమణికలు. ఇచట గ్రంథ సూచికలు, గ్రంథాలయ సూచికలను గూడ వర్గీకరింప వచ్చును. ఐతే ఇది ఐచ్ఛికం. ఐనా వీనిని 016 దగ్గర వర్గీకరించడం మంచిది. |
| –018 | క్రమ విధానం |
| –02 | వివిధ విషయాలు |
| –021 | పట్టిక రూపంలోని సామగ్రి, ఆ సంబంధమైన సామగ్రి |
| –022 | చిత్రాలు, నమూనాలు (మోడల్స్) ఛార్టులు, మొ. |
| –025 | వ్యక్తుల, సంస్థల డైరక్టరీలు |
| –027 | పేటెంట్లు, గుర్తులు |
| –028 | సంవిధానాలు, పరికరాలు. ప్రయోగ దీపికలను గూడ ఇచట వర్గీకరించాలి. |
| –029 | వ్యాపార సంబంధ నానావిధ విషయాలు |
| –03 | నిఘంటువులు, విజ్ఞాన సర్వస్వాలు, పదకోశాలు |
| –04 | సాధారణ అన్వయం కల్గిన ప్రత్యేక విషయాలు |
| –05 | సీరియల్ ప్రచురణలు, పత్రికలు |
| –06 | సంఘాలు, సంస్థలు. చరిత్ర, ఛార్టర్లు, నియమావళి, సభ్యుల పట్టిక, పాలనా నివేదికలు, సభల నివేదికలు మొ. |
| –07 | అధ్యయన, అధ్యాపన (సాధన బోధన) |
| –071 | పాఠశాలలు, శిక్షణ |
| –072 | పరిశోధన |
| –073 | విద్యార్థులు |

| | |
|---|---|
| –074 | చిత్రవస్తు ప్రదర్శన శాలలు కళాఖండాల సంకలనాలు, సూచీలు, గైడ్ బుక్స్ |
| –076 | సమీక్ష, శిక్షణ |
| –08 | వివిధ వ్యక్తుల సముదాయ పరిధులలో ఒక ప్రత్యేక విషయ చరిత్ర వర్ణన |
| –09 | చరిత్ర, భౌగోళిక వివరణ |
| –090 1 | క్రీ॥ 499 వరకు |
| –090 12 | క్రీ పూ 4000 వరకు |
| –090 13 | క్రీ పూ 3999-1000 |
| –090 14 | క్రీ పూ 999–1 |
| –090 15 | క్రీ॥ 1–499 |
| –090 2 | 500–1499 |
| –090 21 | 500–1199 |
| –090 22 | 13వ, శతాబ్దం 1200–1299 |
| –090 23 | 14వ, శతాబ్దం 1300–1399 |
| –090 24 | 15వ, శతాబ్దం 1400–1499 |
| –090 3 | ఆధునిక యుగం 1500– |
| –090 31 | 16వ, శతాబ్దం 1500–1599 |
| –090 32 | 17వ, శతాబ్దం 1600–1699 |
| –090 33 | 18వ, శతాబ్దం 1700–1799 |
| –090 34 | 19వ, శతాబ్దం 1800–1899 |
| –090 4 | 20వ, శతాబ్దం 1900–1999 |
| –090 41 | 1900–1919 |
| –090 42 | 1920–1929 |
| –090 43 | 1930–1939 |
| –090 44 | 1940–1949 |
| –090 45 | 1950–1959 |
| –090 46 | 1960–1969 |
| –090 47 | 1970–1979 |

| | |
|---|---|
| –090 48 | 1980–1989 |
| –090 49 | 1990–1999 |
| –090 5 | 21వ, శతాబ్దం 2000–2099 |
| –091 | ప్రాంతాలు, ప్రదేశాలు |
| –092 | ఏదేని ఒక విషయంతో సన్నిహితత్వంగల వ్యక్తులు, వారి రచనల వర్ణన, విమర్శనాత్మక ప్రశంస, విషయంతో సంబంధం గల వ్యక్తుల జీవిత చరిత్ర, ఆత్మకథ, డైరీలు, అనుభవాలు. వీలున్నంత వరకు ఏదైన ఒక నిర్దిష్ట విషయంతో సంబంధంలేని జీవిత చరిత్రలను 920 లో వర్గీకరించడం మంచిది. |
| –092 2 | సమిష్టి జీవిత చరిత్రలు |
| –092 4 | వైయక్తిక జీవిత చరిత్రలు |
| –093 | ప్రాచీన ప్రపంచం |
| –094 | ఐరోపా |
| –095 | ఆసియా |
| –095 4 | భారతదేశం |
| –095 484 | ఆంధ్రప్రదేశ్ |
| –096 | ఆఫ్రికా |
| –097 | ఉత్తర అమెరికా |
| –098 | దక్షిణ అమెరికా |
| –099 | ఇతర ప్రాంతాలు; భూమ్యేతర ప్రాంతాలు, పసిఫిక్ మహా సముద్ర ద్వీపాలు |

గమనిక: పైన వివరించిన ప్రాదేశిక విభాగాలను అవసరాన్ని బట్టి తదుపరి అధ్యాయంలో సూచించిన రీతిలో పెంచుకోవచ్చు.

—0—

# పట్టిక 2 : ప్రాదేశిక విభాగాలు

ఒక ఖండం, దేశం, ప్రాంతం మొదలగు భూభాగాలను తెలిపే సంకేతాలను ప్రాదేశిక విభాగాలు (ఏరియా టేబిల్స్) అంటారు. ఇంతకు పూర్వం వీటిని భౌగోళిక విభాగాలు (జియోగ్రాఫికల్ టేబుల్స్) అనేవారు. సహాయక పట్టికలలో ఇదొక ప్రముఖ భాగం. ఇంతకు ముందే వివరించినట్లు ఇవి సహాయక విభాగాలే. వీటిని సరాసరి సంకేతాలుగా వినియోగించరాదు. విధానంలో నిర్దేశించిన రీతిలోనే చేర్చాలి.

1 వర్గీకరణ విధానంలో ప్రాదేశిక విభాగాలు ఎక్కడ చేర్చమని నిర్దేశిస్తే అక్కడే చేర్చాలి.

ఉదా: 554—559 వివిధ ఖండాలలో, దేశాలలో భూగర్భ శాస్త్రం

గమనిక: ఇచట అనుసూచీలో, మూల సంఖ్య 55కు, 4—9 ప్రాదేశిక విభాగం 2వ పట్టికనుంచి చేర్చవచ్చు.

55 భూగర్భ శాస్త్ర మూల సంఖ్య
—5 ఆసియా సంకేతం (ప్రాదేశిక విభాగం నుంచి)
55 + —5 = 555 ఆసియాలో భూగర్భ శాస్త్రం
అలాగే 55 + —54 = 555.4 భారతదేశంలో భూగర్భ శాస్త్రం

2 వర్గీకరణ విధానంలో ప్రాదేశిక విభాగం చేర్చమని నిర్దేశించక పోయినా అవసరాన్ని బట్టి ప్రామాణిక ఉప విభాగం '09' ద్వారా చేర్చుకోవచ్చు.

360 సామాజిక సమస్యలు, సేవలు
—09 చరిత్ర (ప్రామాణిక ఉప విభాగం)
—093-099 వివిధ ఖండాల, దేశాల చరిత్ర

గమనిక: వివిధ ప్రదేశాల సంకేతాన్ని 3—9 2వ, పట్టిక నుంచి మూల సంఖ్య—09కు చేర్చాలి.

—09 + -54 = -0954 భారతదేశం

| 36 + | —0954 | 360,954 భారత దేశంలో |
|---|---|---|
| [సామాజిక సమస్యల మూల సంఖ్య] | భారతదేశ ప్రాదేశిక సంకేతం | సామాజిక సమస్యలు |

3 ఒక్కోసారి ప్రాదేశిక సంకేతాన్ని —'09' ద్వారాకాక '0' ద్వారా కూడా చేర్చవచ్చు.

027 సాధారణ గ్రంథాలయాలు.
027.01—.09 వివిధ ప్రదేశాలలోని [సాధారణ గ్రంథాలయాలు]

గమనిక : ప్రాదేశిక సంకేతాన్ని 1—9, 2వ పట్టిక నుంచి మూల సంఖ్య —027.0కు చేర్చాలి.

| 027 | + 0 + -54 | = 027. 054 భారతదేశంలో |
|---|---|---|
| [సాధారణ గ్రంథాలయాలు] | [భారతదేశ ప్రాదేశిక సంకేతం] | సాధారణ గ్రంథాలయాలు |

4 ప్రాదేశిక విభాగాలను అవసరాన్ని బట్టి ఒకే విషయంలో రెండు సార్లు ఉపయోగింప వచ్చు.

ఉదా :

327 + – 54 + 0 + – 44 = 327.540 44 భారత

[అంతర్జాతీయ సంబంధాలు] [భారతదేశ సంకేతం, 2వ పట్టిక నుంచి] [ఫ్రాన్స్‌దేశ సంకేతం, 2వ పట్టిక నుంచి] [ఫ్రాన్స్ దేశాలమధ్య అంతర్జాతీయ సంబంధాలు]

5 డ్యూయీ పథకం 1వ, సంపుటిలోని పుట 14,27లలో ఇచ్చిన వివరణల రీత్యా, ఒక మూలవిషయ సంఖ్యకు ఒకేసారి ప్రాంతీయ (regional) ప్రాదేశిక (of a continent or country) సంకేతాలను రెంటినీ జోడించవలసి వచ్చినప్పుడు, దిగువ తెల్పిన రెండు పద్ధతులలో ఏదేని ఒక పద్ధతి అనుసరించి వర్గసంఖ్య నిర్మించవచ్చు.

1 మొదట మూల విషయ సంఖ్యకు, ప్రాంతీయ సంకేతంచేర్చి, దానికి '0' జోడించి, తరువాత ప్రాదేశిక విభాగాన్ని 3–9, 2వ పట్టిక నుంచి చేర్చవచ్చు.

ఉదా ;

330.9 + – 1734 + 0 + – 54 = 330.917 340 54

[ఆర్థిక పరిస్థితులు —మూల సంఖ్య] [పల్లెప్రాంతాలు] —ప్రాంతీయ సంకేతం [భారతదేశం] —ప్రాదేశిక సంకేతం [భారతదేశంలోని పల్లె ప్రాంతాలలో ఆర్థిక పరిస్థితులు

2 లేదా మూల విషయసంఖ్యకు మొదటనే ప్రాదేశిక (of a country) సంకేతం ఇచ్చి, తరువాత సంకేతం '009' జోడించి, అటు పిమ్మట ప్రాంతీయ సంకేతంలోని మొదటి అంకె '1' ని పరిహరించిచేర్చాలి.

330.9 + – 54 + 009 + – [1] 734 = 330.954 009 734

[మూల విషయం] [ప్రాదేశిక సంకేతం] [ప్రాంతీయ సంకేతం] [భారతదేశంలోని పల్లె ప్రాంతాలలో ఆర్థికపరిస్థితులు]

6 ఒక్కోసారి ప్రాదేశిక విభాగాన్ని అనుసూచీలోని మూల విషయం లోనే అంతర్భాగంగా ఇస్తారు. అలాంటి సందర్భాలలో, ఈ మూల విషయ వర్గ సంఖ్యలకు అధీన (Subordinate) ప్రాదేశిక సంకేతాన్ని 2వ, పట్టికలోని సంకేతాన్ననుసరించి జోడిస్తారు.

315 ఆసియా ఖండపు సాధారణ గణాంకాలు
315.4 భారతదేశపు " "
315.484 ఆంధ్రప్రదేశ్ " "

ప్రాదేశిక విభాగాలు

**–1 సాధారణ ప్రదేశాలు, ప్రాంతాలు, స్థలాలు**

(ఏ ఒక్క ఖండానికి' దేశానికి, స్థానిక ప్రదేశానికి, పరిమితం కానివి)

–11 మంచు ప్రాంతాలు
–12 సమశీతోష్ణ ప్రాంతాలు
–13 వేడి ప్రాంతాలు
–14 భూ భాగాలు
–15 వృక్ష సంతతి రకాలను బట్టి ప్రాంతాలు
–16 గాలి, నీరూ
–165 హిందూ మహాసముద్రం
–17 సాంఘిక ఆర్థిక ప్రాంతాలు
–18 ఇతర భూ భాగాలు
–19 రోదసి

**–2 ఏ ప్రదేశం ప్రాంతం స్థలంతో నిమిత్తం లేని వ్యక్తులు**

–22 సమూహాలు
–23 వ్యక్తులు
–26 వ్యక్తుల వృత్తాంతాలు

**–3 ప్రాచీన ప్రపంచం**

–31 చైనా
–32 ఈజిప్టు
–33 పాలస్టయిన్

–34 భారతదేశం

–35 మెసపుటేమియా, ఇరానియన్ పీఠభూమి

–36 ఉత్తర ఐరోపా, దక్షిణ ఇటాలియన్ ద్వీపకల్పం

–37 ఇటాలియన్ ద్వీపకల్పం, సమీప ప్రాంతాలు. (రోమన్ సామ్రాజ్యం)

–38 గ్రీస్

–39 ప్రాచీన ప్రపంచంలో ఇతర ప్రాంతాలు, ఆసియా మైనర్, సైప్రస్, సిరియా, కాకస్ సముద్ర ప్రాంతం, నల్ల సముద్రం. దక్షిణ ఆసియా, ఉత్తర ఆఫ్రికా మొ—దేశాలు

గమనిక:— –31 నుంచి –39 వరకు గల విభాగాలు ప్రాచీన ప్రపంచ చరిత్రలో దేశాలను తెలుపుతాయి. అవసరమని భావిస్తే వీటిని ఉపయోగించకుండా, ఆధునిక చరిత్రలో అంటే 940 నుంచి 990 వరకు గల విభాగాలలో ఉపయోగించవచ్చు.

–4 –9 ఆధునిక ప్రపంచం : ఈ విభాగంలో ఆధునిక ప్రపంచం లోని దేశాల పట్టిక ఉంటుంది. అవసరమని భావిస్తే ప్రాచీన ప్రపంచానికి సంబంధించిన దేశాల విషయాలను కూడ ఇచ్చట చేర్చుకొనవచ్చు. కాని—3 వాడుకోవడం మంచిది.

**–4 ఐరోపా**

–41 బ్రిటీషు దీవులు

–42 ఇంగ్లండు, వేల్సు

–421 లండన్

–43 మధ్య ఐరోపా, జర్మని

–44 ఫ్రాన్స్, మొనాకో

–45 ఇటలీ

–46 ఐబీరియన్ ద్వీపకల్పం, సమీప దీవులు. స్పెయిన్

–47 సోవియట్ రష్యా

–48 స్కాండినేవియా

–49 ఐరోపా లోని ఇతర భాగాలు

| | |
|---|---|
| –492 | నెదర్ లాండ్సు (హాలండ్) |
| –493 | బెల్జియం |
| –494 | స్విట్జర్ లాండ్ |
| –495 | గ్రీస్ |
| –496 | బాల్కన్ ద్వీప కల్పం |
| –497 | యుగోస్లావియా, బల్గేరియా |
| –498 | రుమేనియా |

**–5 ఆసియా ప్రాచ్య, దూర ప్రాచ్య తూర్పుదేశాలు**

| | |
|---|---|
| –51 | చైనా సమీప, ప్రాంతాలు |
| –515 | టిబెట్ |
| –519 | కొరియా |
| –52 | జపాన్, సమీప దీవులు |
| –53 | అరేబియన్ ద్వీప కల్పం, సమీప ప్రాంతాలు |
| –54 | దక్షిణ ఆసియా–భారత దేశం–(హిమాలయాలు, బ్రహ్మపుత్రా నదిని ఇచట వర్గీకరించాలి) |
| –541 | ఈశాన్య బారతదేశం (గంగానదిని ఇచట వర్గీకరించాలి) |
| –541 2 | బీహార్ |
| –541 3 | ఒరిస్సా |
| –541 4 | పశ్చిమ బెంగాల్ - కలకత్తా, పూర్వపు బెంగాల్ రాష్ట్రాన్ని ఇచటే వర్గీకరించాలి. |
| –541 5 | త్రిపుర |
| –541 6 | అస్సాం, నీఫా, నాగభూమి |
| –541 62 | అస్సాం |
| –541 63 | అరుణాచల ప్రదేశ్ |
| –541 64 | మేఘాలయ |
| –541 65 | నాగభూమి |
| –541 66 | మిజోరమ్ |
| –541 67 | సిక్కిం |
| –541 7 | మణిపూర్ |

| | |
|---|---|
| –542 | ఉత్తరప్రదేశ్ |
| –543 | మధ్యప్రదేశ్ |
| –544 | రాజస్థాన్ (థార్ ఎడారిని ఇచట వర్గీకరించాలి) |
| –545 | పంజాబ్ ప్రాంతం. పూర్వపు పంజాబ్ రాష్ట్రాన్ని (ప్రావిన్స్) ఇచట వర్గీకరించాలి |
| –545 2 | హిమాచల్ ప్రదేశ్ |
| –545 5 | పూర్వపు పంజాబ్ రాష్ట్రం (స్టేట్)—ఛండీఘర్ |
| –545 52 | పంజాబ్ |
| –545 58 | హర్యానా |
| –545 6 | ఢిల్లీ |
| –546 | జమ్ము, కాశ్మీర్. కాశ్మీర్ విషయంలో భారత, పాకిస్తాన్‌ల మధ్య వివాదం |
| –547 | పశ్చిమ భారతదేశం |
| –547 5 | గుజరాత్ |
| –547 9 | మహారాష్ట్ర, సమీప భూభాగాలు |
| –547 92 | మహారాష్ట్ర—బొంబాయి |
| –547 96 | దాద్రా, నాగర్ హవేలీ |
| –547 99 | గోవా, డామన్, డైయూ |
| –548 | దక్షిణ భారతదేశం |
| –548 1 | లక్షద్వీప్, మినికాయ్, అమీనా దీవులు |
| –548 2 | తమిళనాడు (మద్రాసు) |
| –548 3 | కేరళ |
| –548 4 | ఆంధ్రప్రదేశ్ |
| –548 6 | పుదుచ్చేరి |
| –548 7 | కర్ణాటక |
| –548 8 | అండమాన్, నికోబార్ దీవులు |
| –549 | పాకిస్తాన్, ఇతర అధికార ప్రాంతాలు |
| –549 1 | పశ్చిమ పాకిస్తాన్ |
| –549 2 | తూర్పు పాకిస్తాన్ |

ఒకప్పుడు ఈ భాగాన్ని తూర్పు బెంగాల్ అని పిలిచే వారు. 1971 నుంచి బంగ్లాదేశ్‌గా మారింది

–549 3 శ్రీలంక (సింహళం)

–549 5 మాల్దీవ్ దీవులు

–549 6 నేపాల్

–549 8 భూటాన్

–55 ఇరాన్ (పర్షియా)

–56 మధ్య ప్రాచ్యదేశాలు టర్కీ, సైప్రస్, ఇరాక్ మొ॥ దేశాలు

– 57 సైబీరియా

– 58 మధ్య ఆసియా, ఆఫ్ఘనిస్థాన్, తుర్కిస్థాన్, కగజస్థాన్, యూజ్బెకిస్థాన్ మొ॥ దేశాలు

– 59 ఆగ్నేయాసియా

– 591 బర్మా

– 592 థాయిలెండ్ (సయాం)

– 595 కామన్‌వెల్త్ దేశాల భూభాగాలు — మలేషియా

– 595 1 మలయా

– 595 2 సింగపూర్

– 595 3 సబా (మలేషియా)

– 595 4 సారవాక్

– 596 కంబోడియా (కంపూచియా)

– 597 వియత్నాం

– 598 ఇండోనేషియా

– 599 ఫిలిప్పయిన్స్

**– 6 ఆఫ్రికా**

– 61 ఉత్తర ఆఫ్రికా

– 62 నైల్ దేశాలు — ఈజిప్టు

– 63 ఇథోపియా (అబిసీనియా)

– 64 మొరాకో, సమీప దీవులు

— 65 అల్జీరియా
— 66 పశ్చిమ ఆఫ్రికా, సాగర దీవులు
— 67 మధ్య ఆఫ్రికా, సాగర దీవులు
— 68 దక్షిణ ఆఫ్రికా
— 69 దక్షిణ భారత సాగర దీవులు. మెడగాస్కర్, మారిషస్ మొ॥ దీవులు

**— 7 ఉత్తర అమెరికా**

— 71 కెనడా
— 72 మధ్య అమెరికా — మెక్సికో
— 73 సంయుక్త రాష్ట్రాలు

**— 8 దక్షిణ అమెరికా**

— 81 బ్రెజిల్
— 82 అర్జెంటీనా
— 83 ఛైల్
— 84 బొలీవియా
— 85 పెరూ
— 86 పనామా
— 87 వెనుజులా
— 88 బ్రిటీషు, ఫ్రెంచ్, డచ్, గయానాలు
— 89 దక్షిణ అమెరికాలో ఇతర భాగాలు

**— 9 ప్రపంచంలో ఇతర భాగాలు, భూమ్యేతర ప్రపంచాలు, పసిఫిక్ సముద్ర దీవులు**

— 93 న్యూజిలాండ్, మలానీషియా
— 94 ఆస్ట్రేలియా
— 95 న్యూగినీ
— 96 ఇతర పసిఫిక్ భాగాలు, పోలినీషియా
— 97 అట్లాంటిక్ సముద్ర దీవులు
— 98 ఆర్కిటిక్ దీవులు, అంటార్కిటికా
— 99 భూమ్యేతర ప్రపంచాలు

—o—

## పట్టిక 3 : సాహిత్య ఉప విభాగాలు

సాహిత్య సంబంధమైన ప్రక్రియలను, సాహిత్య ఉప విభాగాలని వర్గీకరణ పరిభాషలో అంటారు. రచయితలు తమ రచనలను తమకు నచ్చిన ప్రక్రియలో చేస్తారు. అది పద్య కావ్యం కావచ్చు. నాటకం కావచ్చు, నవల కావచ్చు. ఈ ప్రక్రియను అనుసరించి వర్గీకరణ జరిగినపుడే రచయితకు, దృక్పథానికి న్యాయం జరుగుతుంది. ఈ విభాగాలను సరాసరి ఉపయోగించరాదు. సాహిత్యం లోని, అంటే 810-890 వరకు గల, సంకేతాలకు కలిపి మాత్రం ఉపయోగించాలి.

ఇచట ఒక ప్రత్యేకత ఉంది. రచయిత తాలూకు ఒక విషయంపై గల రచనలతోబాటు, దానిపైగల విమర్శలు, ప్రశంసలు గల రచనలు కూడా ఒక చరికి వస్తాయి. ఇది ఒక విషయంపై ప్రత్యేక అధ్యయనం చేసే వారికి ఎంతో ప్రయోజనాత్మకంగా ఉంటుంది.

## తెలుగు సాహిత్యం

తెలుగు నాటగల గ్రంథాలయాలలో తెలుగు గ్రంథాలు, అందు ముఖ్యంగా తెలుగు సాహిత్యంపై గ్రంథాలు ఎక్కువగా ఉండడం సహజం. తెలుగు సాహిత్యంలోని ప్రక్రియలన్నింటికీ అమెరికాలో రూపొందించిన దశాంశ వర్గీకరణ విధానం తగినంతగా న్యాయం చేయలేదు గదా! ఈ లోపాన్ని గమనించి ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ శాఖ దశాంశ పథకంలో మూల సిద్ధాంతాలకు భంగం కలుగని రీతిలో కొన్ని సంకేతాలను సిద్ధం చేశారు. ఇవి పౌర గ్రంథాలయాలన్నింటిలో ఆచరణలో ఉన్నాయి.

ఈ దిగువన ముందుగా అన్ని సాహిత్యాలకు అన్వయించే విభాగాలు ఆ తర్వాత తెలుగు సాహిత్యానికి ఉపకరించే విభాగాలు ఇవ్వడం జరిగింది. తెలుగు సాహిత్యానికే గూడా డ్యూయీ రూపొందించిన విభాగాలను ఉపయోగించు కొనవచ్చు. ఆ స్వేచ్ఛ గ్రంథ పాలకునికి ఉంటుంది.

1 ప్రధానవర్గం సాహిత్యం 800 కు మాత్రమే ఈ పట్టికలోని ఉప విభాగాలు ముఖ్యంగా వర్తిస్తాయి. వర్గసంఖ్య 792.090 9 నాటక ప్రదర్శన శాలలో ప్రత్యేక అంశాలు క్రింద పట్టిక 3 A ను సరాసరి జోడించడానికి సూచన ఇచ్చారు.

3 వపట్టికను-పట్టిక 3, పట్టిక 3A అనిరెండు భాగాలుగా విభాగించారు. ఈ పట్టికలను ఎలా ఉపయోగించాలో తెల్పుతూ ప్రధాన వర్గం 800 క్రిందను, పట్టికలలోను అవసరమైన చోట్ల సూచనలు ఇచ్చారు. అనుసూచీలో ఏయే వైయక్తిక భాషా సాహిత్యాలలో పట్టిక 3 లోని సంకేతాన్ని చేర్చవచ్చో తెల్పడానికి నక్షత్రంతో గుర్తు వేసారు.

2 ప్రామాణిక ఉపవిభాగం—08 ను ఇక్కడ ప్రత్యేకార్థంలో వాడారు. —08 సంకలనాలు (కలెక్షన్స్) ఒకటి కంటే ఎక్కువ రూపాలు, ఒకరికంటె ఎక్కువమంది చేసిన రచనలను మాత్రం ఇచట చేర్చాలి. ఒక నిర్దిష్టమైన సాహిత్యం తాలూకు సాహిత్య రచనలు, చరిత్ర, వర్ణన,విమర్శాత్మక ప్రశంసల తాలూకు సంకలనాలు సమంగా ఉంటే ఇచట చేర్చాలి. ఒక వ్యక్తి సంకలనాలను - 1 నుంచి - 8 దగ్గర వర్గీకరించాలి. అలాగే ప్రామాణిక ఉప విభాగం —09 ను కూడా విస్తరించి ప్రత్యేకార్థంలో వాడాలి.

3 ఒక కథగాని, ఒక నాటికగాని ప్రత్యేకంగా ఒక గ్రంథంగా ప్రకటించే అవకాశం తక్కువ. సాధారణంగా కొన్ని కథలు లేదా కొన్నినాటికలు ఒక సంపుటిగా వెలువడుతాయి. ఇది సహజం. కనుక ఇచట సంకలనాలకు 08 సకేతం చేర్చవలసిన అవసరం లేదు.

4 ఒక భాషా సాహిత్యానికి కాల విభాగాలు జోడించ వలసినప్పుడు, అనుసూచీలో ఆ భాషా సాహిత్యం క్రింద వివరించబడిన కాల పట్టికలోని విభాగాలే వాడాలి. కాని ఏ ఒక్క భాషకు పరిమితం కాని సాహిత్య రచనలకు మాత్రం కాల విభాగాలను ప్రామాణిక ఉప విభాగాల పట్టిక:1 నుంచి చేర్చాలి.

5 కావ్య రచన, నాటక రచనా విధానాలు అలంకార శాస్త్రానికి చెందినవి. అలంకార శాస్త్రాలను ఇంతకు పూర్వం 420-490 లో వర్గీకరించారు. దశాంశ వర్గీకరణ ప్రస్తుత కూర్పులో వీటిని 808 లో చేర్చారు. కాని వీటిని భాషా శాస్త్రంలోనే వర్గీకరించడం సముచితం.

6 –09 చరిత్ర, వర్ణన, విమర్శాత్మక ప్రశంస, ఒకటికంటె ఎక్కువ రూపాలు, ఒకరి కంటే ఎక్కువ మంది చేసిన రచనలను మాత్రం ఇక్కడ చేర్చాలి. వారి జీవిత చరిత్రలను గూడ ఇచట చేర్చాలి. ఒక రచయిత తాలూకు రచనలపై వర్ణన, విమర్శాత్మక ప్రశంస, జీవిత చరిత్రను—1 నుంచి—8 లో వర్గీకరించాలి. వ్యక్తిగత రచయితలకు సంబంధించిన రచనలు, వాటిపై విమర్శలను ఒకే వర్గసంఖ్య క్రింద వర్గీకరించాలి. ఈ రచనలకు పట్టిక 3A కాని, విస్తృతార్థంలో ఇచ్చిన ప్రామాణిక ఉప విభాగాలు కాని చేర్చరాదు.

ఉదా: విశ్వనాథవారి రామాయణ కల్పవృక్షం = 894.827 17

కొత్త సత్యనారాయణ చౌదరిగారి రామాయణ కల్పవృక్ష ఖండన — 894. 827 17

7 అన్ని ముఖాలు (Facets) కల్గిన భాషా సాహిత్యరచనలకు వర్గసంఖ్యల నిర్మాణం దిగువ తెల్పిన క్రమంలో చేస్తారు —

మూలసంఖ్య + రూపము + కాలము + విస్తరించిన + సాహిత్య విషయం లేక

ప్రామాణిక దృక్పథాంశాలు

ఉప విభాగం (పట్టిక 3A నుంచి)

—08/—09

ఉదా: (1) స్వాతంత్ర్యానంతరం బాలలకై రచింపబడిన ఆధునిక తెలుగు పద్య కావ్యాల సంకలనం

894.827 + — 1 + — 7 + — 080+ — 9282

| తెలుగు సాహిత్యం మూల సంఖ్య] | పద్య కావ్యాలు [రూపం] | స్వాతంత్ర్యా నంతర కాలం [కాలవిభాగం] | సంకలనం [విస్తరించిన పౌరాణిక ఉపవిభాగం] | బాలలు [పట్టిక 3A నుంచి] |
|---|---|---|---|---|

= 894. 827 170 809 282

ఉదా: (2) నేటి తెలుగు నవలల్లో సమకాలీన సాంఘిక పరిస్థితుల చిత్రణ

894.827 + — 3 + — 7 + —09 + — 355

| తెలుగు సాహిత్యం [మూల సంఖ్య] | కల్పనా సాహిత్యం [రూపం] | ప్రస్తుత కాలం 20వ శతాబ్దపు ద్వితీయార్ధ కాల విభాగం | చరిత్ర విమర్శ [విస్తరించిన పౌరాణిక ఉప విభాగం] | సమకాలీన సాంఘిక పరిస్థితులు పట్టిక 3A నుంచి] |
|---|---|---|---|---|

= 894.827 370 935 5

8 A) రూపాంశం లేని సాహిత్య రచనలు— వర్గ సంఖ్యల నిర్మాణం

మూలసంఖ్య + —080 (పట్టిక 3) + సాహిత్యాంశం (పట్టిక3A

ఉదా:—

ప్రేమలు, పెళ్ళిళ్ల గురించిన తెలుగు సాహిత్య సంకలనం

894.827 + — 080 + — 354 = 894.827 080 354

[మూలసంఖ్య] [పట్టిక 3] [పట్టిక 3A ]

B) రూపం, కాలం కాని రచనలు—వర్గసంఖ్యల నిర్మాణం

ఉదా: తెలుగు సాహిత్యానికి ఆంగ్లేయులు చేసిన సేవ—ఒక పరిశీలన

894.827 + -09 + 8 + 21 = 894.827 098 21
[మూలసంఖ్య] [పట్టిక 3] [పట్టిక3A] [పట్టిక5]

C) ఒక భాషా సాహిత్యానికి పరిపుష్టి చేకూర్చిన విజాతీయుల రచనల సంకలనాలు—వర్గ సంఖ్యల నిర్మాణం

ఉదా: ఆంధ్రులు రచించిన సంస్కృత పద్య కావ్యాల సంకలనం

891.2 + 1008 + 0 +9 5484 = 891.210 080 954 84
[మూలసంఖ్య] [పట్టిక 3] [పట్టిక 3A] + [పట్టిక 2]

## ప్రధాన రూపాలు

పద్యకావ్యాలు, నాటకాలు మొదలైన సాహిత్య రూపాలు ఈ దిగువ ఉన్నాయి. హాస్యాన్ని వ్యంగ్యాన్ని కలిగి ఉన్నవి, ఏ రూపంలో ఉన్నా -7 హాస్య, వ్యంగ్య రచనలవద్ద వర్గీకరించడం మంచిది. ఒక రచయిత ఏ ప్రక్రియ వల్ల విశేషంగా ప్రజాదరణ పొందుతారో, ఆ రచయిత తాలూకు వర్ణనలు, విమర్శాత్మక ప్రశంసలు, జీవిత చరిత్ర గ్రంథ సంకలనాలు ప్రాచుర్యం పొందిన ఆ ప్రక్రియవద్దే వర్గీకరించాలి.

## సాహిత్య ఉప విభాగాలు

- 1 పద్య కావ్యాలు

| | |
|---|---|
| – 102 | నాటకీయ పద్య కావ్యాలు |
| – 103 | పౌరాణిక పద్య కావ్యాలు |
| – 104 | గేయ కావ్యాలు |
| – 105 | నీతి బోధక కావ్యాలు |
| – 106 | వర్ణనాత్మక కావ్యాలు |

| | |
|---|---|
| – 107 | హాస్య, వ్యంగ్య కావ్యాలు |
| – 108 | చౌకబారు కవిత్వం |
| – 11–19 | నిర్దిష్ట కాలాల కవిత్వం |
| **– 2** | **నాటకం** |
| – 202 | రేడియో, టి. వి నాటకాలు |
| – 203 | చలన చిత్ర నాటకాలు |
| – 204 | సాధారణ నాటకాలు |
| – 205 | ప్రత్యేక నాటకాలు |
| – 205 12 | విషాదాంత నాటకాలు |
| – 205 14 | చారిత్రాత్మక నాటకాలు |
| – 205 27 | సుఖాంత నాటకాలు |
| – 21 –29 | నిర్దిష్ట కాలాల నాటకాలు |
| **– 3** | **నవలలు, కథలు** |
| – 301 | కథలు |
| – 306 | కామిక్స్ |
| – 308 | వివిధ రకాల నవలలు |
| – 308 76 | సైన్సు నవలలు |
| – 31 –39 | నిర్దిష్ట కాలాల నవలలు |
| **– 4** | **వ్యాసాలు** |
| – 41 –49 | నిర్దిష్ట కాలాల వ్యాసాలు |
| **– 5** | **ఉపన్యాసాలు** |
| – 501 | బహిరంగ ఉపన్యాసాలు |
| – 503 | చర్చలు |
| – 51 –19 | నిర్దిష్ట కాలాల ఉపన్యాసాలు |

| | |
|---|---|
| **—6** | **ఉత్తరాలు** |
| —61 -69 | నిర్దిష్ట కాలాల ఉత్తరాలు |
| **—7** | **హాస్యం, వ్యంగ్యం** |
| —71 —79 | నిర్దిష్ట కాలాల హాస్యం, వ్యంగ్యం |
| **—8** | **ఇతర రచనలు** |
| —802 | సూక్తులు, చలోక్తులు |
| —803 | డైరీలు, పత్రికలు, జ్ఞాపకాలు |
| —804 | ప్రయోగాత్మక రచనలు |
| —808 | వచన సాహిత్యం |
| —81 -89 | నిర్దిష్ట కాలాల ఇతర రచనలు |

## తెలుగు సాహిత్య ఉప విభాగాలు

| | |
|---|---|
| **—1** | **పద్య కావ్యాలు** |
| —11 | భారతం |
| —12 | రామాయణం |
| —13 | ప్రబంధాలు |
| —14 | కావ్యాలు |
| —15 | శతకాలు |
| —16 | గేయాలు |
| —17 | భావ కావ్యాలు |
| —18 | అభ్యుదయ కావ్యాలు |
| —19 | మినీ కవితలు |
| **—2** | **నాటకాలు, ప్రదర్శన సాహిత్యం** |
| —21 | నాటకాలు |
| -211 | పౌరాణిక నాటకాలు |
| -212 | చారిత్రక నాటకాలు |

–213 సాంఘిక నాటకాలు
–214 అపరాధ పరిశోధక నాటకాలు
–215 వైజ్ఞానిక నాటకాలు
–216 సాహసోపేత నాటకాలు
–217 హాస్య నాటకాలు
–219 నృత్య, సంగీత ఇతర నాటకాలు
–23 నాటికలు
–24 రేడియో నాటికలు
–25 ఏకాంకిక నాటికలు
–26 ఏకపాత్ర నాటికలు

గమనిక : 211 నుంచి 219 వరకు గల పైన వివరించిన ఉప విభాగాలు 23 నుంచి 26 వరకు వర్తిస్తాయి.

–27 యక్షగానాలు
–28 హరికథలు

**–3 కల్పనా సాహిత్యం**

–31 నవలలు
–32 కథలు
–33 గల్పికలు

గమనిక : 211 నుంచి 219 వరకు పైన వివరించిన ఉప విభాగాలు 31 నుంచి 33 వరకు వర్తిస్తాయి

**–4 వ్యాసాలు**

**–5 ఉపన్యాసలు**

**–6 ఉత్తరాలు**

**–7 హాస్యం, వ్యంగ్యం**

**–8 వచనం**

–81 వచన భారతం
–82 వచన రామాయణం
–83 వచన ప్రబంధాలు
–84 వచన కావ్యాలు
–85 ఇతర ప్రక్రియలు

# 3A సాహిత్య ఉప విభాగ అనుబంధం

దశాంశ వర్గీకరణ పథక 19వ, సంస్కరణ ప్రత్యేకత 3A – అనే ఉప విభాగం చేర్చడం. నేడు సాహిత్యంలో వస్తున్న భిన్న ధోరణులు కేవలం సాహిత్యానికే పరిమితం కావు. ఇతర విషయాలకు సంబంధించిన అనేక భావాలు, ప్రభావాలు సాహిత్యంమీద పడడం వలన, సాహిత్యాన్ని అనేక కోణాలలో నేడు పరిశీలిస్తున్నందున 3A–అనే మరో ఉప విభాగం అవసరమైంది. పథకంలోని సాహిత్య ఉప విభాగాలద్వారా ప్రాదేశిక విభాగాలు, ప్రజాతీయ, మానవ వంశీయ జాతీయ ఉప విభాగాల సంకేతాలను చేర్చుకోడానికి అవకాశం కల్పించడం జరిగింది.

పట్టిక 3A లో ఇచ్చిన వివిధ సాహిత్య దృక్పధాంశాల తీరు ఈ దిగువ రీతిలో ఉంటుంది.

| | |
|---|---|
| 1 | నిర్దిష్ట లక్షణాలు ప్రదర్శించే సాహిత్యం |
| 12 | సాహిత్యంలో వాస్తవ వాదం, ప్రకృతి వాదం |
| 13 | సాహిత్యంలో ఆదర్శ వాదం |
| 14 | ప్రాచీన శైలి అనుసరణ వాదం, రొమాంటిసిజమ్ |
| 15 | సాహిత్యంలో సింబాలిజం, ఎల్లీగొరి, ఫాంటసీ |
| 16 | విషాదాంతం—భయానకం |
| 17 | సుఖాంతం |
| 2 | నిర్దిష్ట ప్రాధమికాంశాలను ప్రదర్శించే సాహిత్యం |
| 22 | వర్ణన |
| 23 | కథన రీతి |
| 24 | వస్తువు (కథా ప్రణాళిక) |
| 26 | సంభాషణలు |
| 27 | పాత్రలు |
| 3 | నిర్దిష్ట వస్తువు, విషయానికి సంబంధించిన సాహిత్యం |

[illegible] సాహిత్యం స్థలాలు, స్థలాల నాగరికతను ఇచట వర్గీకరించాలి. దీనికి 1—9 ప్రాదేశిక విభాగాలు చేర్చవచ్చు.

3 కాలాలు. రుతువులు, ప్రత్యేక దినాలు, చీకటి, ఉషస్సు మొదలైన వాటిని ఇచట చేర్చాలి.

5 సాహిత్యంలో మానవత్వం, మానవ మనుగడ

6 ప్రకృతిని ప్రదర్శించే సాహిత్యం. ఉదా: జంతువులు, అగ్ని, తోటలు, మొక్కలు, వాతవరణం.

7 పురాణ, సాహిత్యం

ప్రజాతీయ, మానవ వంశీయ, జాతీయ సమూహాల చే/కోసం సాహిత్యం

ప్రత్యేక తరగతి వ్యక్తుల సాహిత్యం

1 నిర్దిష్ట ప్రాంతీయుల సాహిత్యం

2 నిర్దిష్ట వర్గాల కోసం సాహిత్యం

3-99 నిర్దిష్ట ఖండాలు, దేశాలు, ప్రదేశాల కోసం సాహిత్యం. దీనికి ప్రాదేశిక విభాగాలు 'చేర్చవచ్చును.

— o —

# 9 పట్టిక 4: భాషా ఉప విభాగాలు

భాషా సంబంధమైన ప్రక్రియలను భాషా ఉప విభాగాలు అని వర్గీకరణ పరి భాషలో అంటారు. భాషావేత్తలు భాషను పరిపుష్టం చేసే ఉద్దేశంతో వేరు వేరు ప్రక్రియలు ఎంచుకొని రచనలు చేస్తారు. అది నిఘంటువు కావచ్చు, అలంకార శాస్త్రం కావచ్చు, వ్యాకరణం కావచ్చు. దానిని అనుసరించి వర్గీకరణ జరిగినప్పుడే రచయిత ఆశయానికి న్యాయం జరుగుతుంది. ఈ విభాగాలకు స్వతంత్ర ప్రయోగార్హత లేదు. వీటిని 420 నుండి 490 వరకు గల నక్షత్రపు గుర్తుతో గుర్తింప బడిన వైయక్తిక భాషలకు మాత్రం వినియోగించవచ్చు. అవసరాన్ని బట్టి ఈ పట్టిక (4) ను, 6వ, పట్టిక ఉపయోగించి విస్తృత పరచవచ్చు. ఇందుకు గాను అవసరమైన సూచనలు పట్టికలోనే చేశారు.

భాషా ఉప విభాగాల పట్టిక 4 ఉపయోగించి వర్గ సంఖ్యలను దిగువ తెల్పిన సూత్రం రీత్యా నిర్మించుకోవచ్చు,

మూల సంఖ్య + పట్టిక 4 లోని సంకేతం + పట్టిక 6 లోని సంకేతం

[ప్రధాన వర్గం 4 కు భాషా [భాషా సమస్యలు] [వివిధభాషలు]
[సంఖ్య జోడిస్తే వచ్చే సంఖ్య]

ఉదా; 1) సంస్కృత భాషా ఉచ్చారణ

491. 2 + — 15 = 491.215 సంస్కృత ఉచ్చారణ

సంస్కృతం ఉచ్చారణ
[మూల సంఖ్య] [పట్టిక 4]

2 హిందీ వ్యాకరణం

491.43 + —5 = 491.435

హిందీ భాష వ్యాకరణం

[మూల సంఖ్య] [పటి క 4]

తెలుగు భాషలో ఫ్రెంచి పదాలు

| 4.827 | + — 24 | + — 41 | = 494.827 244 1 |
|---|---|---|---|
| గు భాష లు సంఖ్య | విదేశీ భాషాంశాలు [పట్టిక 4] | ఫ్రెంచి [పట్టిక 6] | తెలుగులో ఫ్రెంచి పదాలు |

తెలుగు వాచకం రష్యన్ ప్రజలకు

| 4 827 | + — 864 | + 9171 | = 494.827 864 917 1 |
|---|---|---|---|
| గు భాష రాల సంఖ్య] | వాచకాలు— రష్యన్ ప్రజలు [పట్టిక 5]; తెలుగు మాతృభాష కాని వారికి [పట్టిక 4] | | తెలుగు వాచకం రష్యన్లకు |

**భాషా నిఘంటువులు**

వ, కూర్పు 1వ సంపుటంలోని పట్టిక 4 క్రింద ఇచ్చిన సూచనలు ప్రకారం భాషా నిఘంటువులను అవి ఏ భాష క్రింద వర్గీకరిస్తే మిక్కిలి ప్రయోగకరంగా ఉంటాయో అక్కడే వర్గీకరించాలి. ఇంగ్లీషు భాష

(2) సంస్కృతం-హిందీ నిఘంటువు

491.2 + –3 + –91431 = 491.239 143 1

(3) పంజాబీ-మరాఠీ నిఘంటువు

491.46 + –3 + –9142 = 491.463 914 2

(4) జర్మన్-రష్యన్ నిఘంటువు

491.7 + –3 + 31 = 491.733 1

గమనిక:- ఇక్కడ వచ్చిన చిక్కేమంటే, ఒక నిఘంటువును ఏ భాష క్రింద వర్గీకరిస్తే ఎక్కువ ఉపయోగకరంగా ఉంటుందో చెప్పటం అంత సులభమైన పని కాదు. ఇది దృష్టిలో ఉంచుకొనే "మాన్యువల్" పుట 26 లో ఒక ముఖ్య సూచన చేశారు. అదేమంటే ద్విభాష నిఘంటువులకు పరిచయం కాని, పీఠిం కాని ఏ భాషలో రాసారో గమనించి, ఆ భాషను మినహాయించి, నిఘంటువులోని రెండవ భాష వద్ద వర్గీకరించవచ్చని, ప్రత్యామ్నాయ పద్ధతిని సూచించారు.

కాని ఇటీవల డ్యూయీ పథకానికి చేసిన సవరణలలో ద్విభాషా నిఘంటువుల వర్గీకరణానికి మరింత ప్రయోజన కరమైన సూచన చేశారు. అదేమంటే నిఘంటువులో మొదట్లో ఇచ్చిన పదాలు ఏ భాషలో ఉన్నవో, ఆ భాషా సంకేతం నిఘంటువుకు మూల సంఖ్యగా మారుతుంది. తరువాత పట్టిక 4 నుంచి "–3 నిఘంటువు" అనే అంశాన్ని చేర్చి, దానికి పైపదాలకు అర్థం నిఘంటువులో ఏ భాషలో ఇచ్చారో ఆ భాషా సంకేతాన్ని పట్టిక 6 నుంచి చేర్చాలి. దీనికి అన్వయించే సూత్రాన్ని దిగువ రీతిలో చెప్పవచ్చు—

మూల సంఖ్య + –3 నిఘంటువు (పట్టిక 4) + అర్థం సూచించే భాషా సంకేతం (పట్టిక 6)

ఈ సూత్రం ప్రకారం ద్విభాషా నిఘంటువులకు వర్గ సంఖ్యలు నిర్మించడం సులభం అవుతుంది.

ఉదా:-(1) తెలుగు—ఇంగ్లీషు నిఘంటువు (తెలుగు పదాలకు అర్థాలు ఇంగ్లీషులో ఇచ్చారు)

494.827 + —3 + 21 = 494.827 321

(2) ఇంగ్లీషు—తెలుగు నిఘంటువు (ఇంగ్లీషు పదాలకు అర్థాలు తెలుగులో ఇచ్చారు.)

42 + —3 + 94827 = 423.948 27

(3) సంస్కృతం—ఇంగ్లీషు నిఘంటువు (సంస్కృత పదాలకు అర్థాలు ఇంగ్లీషులో ఇచ్చారు)

491.2 + —3 + 21 = 491.232 1

తెలుగు సంప్రదాయం ప్రకారం వ్యాకరణం, ఛందస్సు, అలంకార శాస్త్రం సన్నిహిత సంబంధంగల లక్షణగ్రంథాలు. డ్యూయీ విధానం ప్రకారం అలంకార శాస్త్రం వేరుపడి 800 వర్గంలో చేరిపోయింది. ఈ విధంగా వర్గీకరిస్తే కొంత ఇబ్బంది లేకపోలేదు. అందుచేత మన ప్రయోజనం నిమిత్తం అలంకార శాస్త్రాన్ని భాషా ఉప విభాగంగా (—4) చేర్చబడింది. తెలుగు గ్రంథాలకు ఈ మార్పు తప్పనిసరి.

| | |
|---|---|
| —1 | రాసే, మాట్లాడే భాష |
| —11 | సంకేతం |
| —15 | ధ్వని |
| —152 | పద స్వరూపం, ఉచ్చారణ |
| —16 | స్వరాలు |
| —17 | రాసే తీరు |

| | |
|---|---|
| –2 | వ్యుత్పత్తి |
| –24 | విదేశీ ప్రభావాలు |
| –3 | నిఘంటువులు |
| –31 | ప్రత్యేక నిఘంటువులు<br>సంక్షిప్తాలు, నానార్థాలు, పర్యాయ పదాల వ్యతిరేక పదాల నిఘంటువులు |
| –32–39 | ద్విభాషా నిఘంటువులు<br>6వ పట్టిక నుంచి భాషలు సంకేతా 2 –9న్ని ఇచట చేర్చుకో వచ్చు |
| –4 | అలంకార శాస్త్రాలు (ఈ సంకేతం దశాంశ వర్గీకరణ విధానంలో లేదు మన అవసరం నిమిత్తం చేర్చుకోబడింది) |
| –5 | వ్యాకరణం |
| –6 | ఛందస్సు |
| –7 | ప్రామాణీకరించిన భాష |
| –8 | భాష. ప్రామాణిక వాడకం |
| –802 | ఇతర భాషల నుంచి అనువాదం |
| –81 | పదాలు |
| –82 | ఉచ్చారణ, పదజాలం |
| –84 | చదవడం, శ్రవ్య సాధనల వినియోగం |
| –86 | వాచకాలు |

— o —

# పట్టిక 5 : ప్రజాతీయ మానవ, వంశీయ జాతీయ సమూహాలు

ప్రపంచ వ్యాప్తంగా గల ప్రజాతీయ, మానవ వంశీయ, జాతీయ సమూహాలకు చెందిన వివరాలు ఇందుంటాయి. ఈ సంకేతాలను సరాసరి వర్గసంకేతాలుగా ఉపయోగించరాదు. వర్గ సంకేతానికి మాత్రం అవసరాన్ని బట్టి చేర్చవలసి ఉంటుంది.

ఈ పట్టికలోని సంకేతాన్ని అనుసూచీలో వాసి వాడుకకై సూచనలు ఇచ్చిన తావుల్లో జోడించవచ్చు. లేదా అవసరం అని భావించినప్పుడు ప్రామాణిక ఉప విభాగం —089 ద్వారా ఈ పట్టికలోని సంకేతాన్ని వర్గ సంఖ్యల నిర్మాణానికి వాడుకొనవచ్చు. ఒక్కోసారి ఈ పట్టికలోని సంకేతాన్ని పట్టిక 2లోని సంకేతం వాడి విస్తరించడానికి కూడా అవకాశం కల్పించారు.

ఉదా :- (1)

305 సాంఘిక వ్యవస్థ

> గమనిక : ఇచట 05 ప్రామాణిక ఉప విభాగం కాదు. సహజంగా ఉన్నదే. ప్రామాణిక ఉపవిభాగం చేర్చుకోవాలంటే —005 చేర్చుకోవలసి ఉంటుంది.

305.8 ప్రజాతీయ, మానవ వంశీయ జాతీయ సమూహాలు

> గమనిక : పట్టిక 5 నుంచి జాతీయ సమూహాల సంకేతాన్ని 01–99 మూల సంఖ్య 305.8కు చేర్చాలి.

305.8 + — 948 = 305.894 8 ద్రావిడుల సాంఘిక వ్యవస్థ

ఉదా : (2)

745.5 హస్తకళలు

.089 ప్రత్యేక ప్రజాతీయ, మానవ వంశీయ, జాతీయ సమూహాలకు సంబంధించిన (ప్రామాణిక ఉప విభాగం)

గమనిక : పట్టిక 5 నుంచి జాతీయ సమూహాల సంకేతాన్ని 01—99, మూలసంఖ్య -089కు చేర్చాలి.

089 + 91411 = 089 914 11 భారతీయులు

745.508 991 411 భారతీయుల హస్త కళలు

ఉదా : (3) బెంగాలీల వంటకాలు

641.592 + — 9144 = 641.592 914 4

(4) తెలుగు జానపద గీతాలు

784.76 + — 94827 = 784 769 482 7

(5) అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని భారతీయుల, చదువు సంధ్యలు

371.97 + — 91411 + 0 + —73

[మూలసంఖ్య] [పట్టిక 5] [పట్టిక 2]

= 371.979 141 107 3

**ఉప విభాగాలు**

| | |
|---|---|
| 01 | స్వదేశీయులు |
| 03 | ప్రాథమిక జాతులు |
| 04 | మిశ్రమ ప్రాథమిక జాతులు |
| —1 —9 | భాషల వారీగా వివిధ జాతుల విభజన |
| —1 | ఉత్తర అమెరికనులు |
| —2 | ఆంగ్లేయులు |
| —3 | జర్మనులు |
| —4 | ఫ్రెంచివారు |

| | |
|---|---|
| –5 | ఇటాలియన్లు |
| –6 | స్పానిష్, పోర్చుగీసు వారు |
| –7 | రోమనులు |
| –8 | గ్రీకులు |
| –9 | ఇతర జాతులు |
| –91 | ఇండో – యూరోపియన్ జాతులు |
| –91 411 | భారతీయులు |
| –91 42 | పంజాబీలు |
| –91 43 | హిందీవారు |
| –94 | ద్రావిడులు |
| –94 811 | తమిళులు |
| –94 827 | తెలుగు వారు |
| –951 | చైనీయులు |
| –954 | టిబెటియనులు |
| –956 | జాపనీయులు |
| –957 | కొరియన్లు |
| –958 | బర్మీయులు |
| –96 | ఆఫ్రికనులు |
| –97 | ఉత్తర అమెరికా స్వదేశీ |
| –98 | దక్షిణ అమెరికా స్వదేశీ.... |
| –99 | ఇతర వ్యక్తులు |

# 11 పట్టిక 6 : భాషలు

ఒక విషయం పరిపూర్ణ అవగాహనకు భాషా సంకేతాలనుకూడ ఒక్కోసారి చేర్చవలసివస్తుంది. అందుకని భాషల పట్టిక వేరుగా ఇవ్వడమైనది. ఇందులోని సంకేతాలను సరాసరి ఉపయోగించరాదు. ప్రధాన సంకేతంతో కలిపే ఉపయోగించాలి. వీటిని ప్రతిచోట వినియోగించరాదు. ఉపయోగించాల్సిందని నిర్దిష్టంగా ఆదేశించినపుడు మాత్రము ఉపయోగించాలి.

ఈ పట్టికలోని సంకేతాలను అనుసూచీలోగానీ, ఇతర పట్టికలలో గాని సంకేతాలకు, సూచన ఇచ్చినప్పుడే జోడించాలి.

భాష, సాహిత్యం ప్రధాన వర్గాలలో వ్యక్తీకరింపబడని అనేక అపరిచిత భాషలు, సాహిత్యాలకు సంకేతాలను నిర్మించడంలో ఈ పట్టిక చాల దోహదం చేస్తుంది, పట్టిక 4 లోని సంకేతంతో కలసి ద్విభాషా నిఘంటువులకు వర్గ సంఖ్యలు నిర్మించడంలో ఈ పట్టిక సాయం చేస్తుంది.

ఉదా : తెలుగు బైబిల్

220.5 + – 94827 = 220.594 827

[మూలసంఖ్య] తెలుగు

[పట్టిక 6 నుంచి]

2) ఆస్కాన్ (Oscan) భాష

479 + – 9 = 479.9

ఇతర ఇటాలియన్ భాషలు [మూల సంఖ్య]

ఆస్కాన్ భాష, (పట్టిక 6 లో సంకేతం 79 తరువాత అనుసరించే సంఖ్యలు]

3) ఎలిమెంటరీ స్కూళ్లలో ద్వితీయ భాషగా ఆంగ్లం బోధనా పద్ధతులు

372 65 + – 21 + 044 = 372.652 104 4

| | | |
|---|---|---|
| ఎలిమెంటరీ స్కూళ్లలో విదేశీ భాషలు [మూల సంఖ్య] | ఆంగ్లం [పట్టిక 6 నుంచి] | బోధనా–పద్ధతులు [వర్గ సంఖ్యల శ్రేణి 372.3–372.8 క్రింద ఇచ్చిన పట్టిక న |

ప్రపంచంలోని భాషల జాబితాను శాస్త్రీయమైన క్రమంలో రూపొందించి దిగువ ఉదహరించడమైనది

**భాషల జాబితా**

| | |
|---|---|
| –1 | ఇండో, యూరోపియన్ బాషలు |
| –2 | ఇంగ్లీషు |
| –3 | జర్మన్ |
| –4 | ఫ్రెంచి |
| –5 | ఇటాలియన్ |
| –6 | స్పానిష్, పోర్చుగీసు |
| –7 | లాటిన్ |
| –8 | గ్రీక్ |
| –9 | ఇతర భాషలు |
| –91 | తూర్పు ఇండో యూరోపియన్ బాషలు |
| –911 | ఇండో ఆర్యన్ భాషలు |
| –912 | సంస్కృతం |
| –913 | ప్రాకృతం |
| –913 7 | పాళి |
| –914 | ఆదునిక భారతీయ బాషలు |
| –914 1 | సింధి |
| –914 2 | పంజాబీ |

—914 3 హిందీ

—914 39 ఉర్దూ

—914 4 బెంగాలీ

—914 5 అస్సామీ, బీహారి, ఒరియా, మైథిలి

—914 6 మరాఠి, కొంకణి

—914 71 గుజరాతీ

—914 79 రాజస్థానీ, మార్వారి

—914 8 సింహళీస్

—914 99 దర్ద భాషలు, కాశ్మీరీ మొ॥

—915 ఇరానియన్ భాషలు

—915 5 పర్షియన్(పార్సీ)

—916 కెల్టిక్ భాషలు

—917 రష్యన్

—92 ఆఫ్రో ఆసియా భాషలు

—93 హామిటిక్ భాషలు

—94 ద్రావిడ, తదితర బాషలు

—948 ద్రావిడ భాషలు

—948 1 ద్రావిడ సమూహం

—948 11 తమిళం

—948 12 మళయాళం

—948 14 కన్నడం

—948 2 ఆంధ్ర సమూహం

—948 27 తెలుగు

—951 చీనీ

—956 జపనీస్

| | |
|---|---|
| –957 | కొరియన్ |
| –958 | బర్మీస్ |
| –96 | ఆఫ్రికా భాషలు |
| –97 | అమెరికన్, ఇంగ్లీషు కాక మిగతా భాషలు |
| –99 | ఇతర భాషలు |
| –991 5 | ఆస్ట్రేలియా భాషలు |

# 12 పట్టిక 7 : వ్యక్తులు

ప్రపంచ వ్యాప్తంగా గల వివిధ వ్యక్తుల వృత్తులు, సంస్కారాలు, ఆర్థిక సామాజిక స్థితులకు చెందిన విభాగాలు ఇందులుంటాయి. ఈ విభాగాలు సరాసరి సంకేతాలుగా ఉపయోగించరాదు. ప్రధాన వర్గ సంకేతానికి అవసరాన్ని బట్టి చేర్చవలసి ఉంటుంది.
విషయానికి వ్యక్తులకు సంబంధం నిరూపించ వలసినపుడు ఈ విభాగం ఉపయోగించ వలసి ఉంటుంది.

ప్రత్యేకంగా ఏవృత్తికి సంబంధించని వ్యక్తుల సముహాలను 0—08 సంకేత శ్రేణిలో అమర్చారు. సంకేతం 0—09ని ఏదైన ఒక ప్రత్యేక వృత్తికి సంబంధించిన వారికొరకు, సంకేతం -1 నుంచి —9ని ఒక ప్రత్యేక శాస్త్రం లేదా విషయంలో నిమగ్నులైన వారి కొరకు కేటాయించారు. అనుసూచీలో గాని ఇతర సహాయక పట్టికలలోగాని నిర్దిష్టతావుల్లో సూచనలు ఇస్తే ఈ పట్టికను వాడచ్చు. లేదా ప్రమాణిక ఉప విభాగం — 088 ద్వారా ఈపట్టికలోని సంకేతాన్ని వాడచ్చు.

ఉదా:

1 క్రికెటర్లకు సంబంధించిన ఆచారాలు

390. 4 + —79635 = 390.479 635
[పట్టిక 7]

2 గ్రంథాలయ వృత్తికి సబంధించిన నైతిక విలువలు, నీతి సూత్రాలు

174. 9 + — 092 = 174.909 2
[పట్టిక 7]

3 వైద్యుల కొరకు మనస్తత్వ శాస్త్రం

15 -- -024 -- 61 = 150.246 1
[పట్టిక 1] [పట్టిక 7]

4 ఆఫ్రికా నల్ల ముస్లిం దేశాలలోని రాజకీయ పరిస్థితులు

320. 9 + -6009 + -7677 = 320.960 097 677
[పట్టిక 2 + పట్టిక 7]

5 తెలుగులో కృషీవల కవిత్వం

894.827 + 10080 + 35263
[పట్టిక 3A + పట్టిక 7]
= 894.827 100 803 526 3

**ఉప విభాగాలు**

| | |
|---|---|
| -01 | వైయక్తిక వ్యక్తులు |
| -02 | సామూహిక వ్యక్తులు |
| -03 | ప్రజాతీయ, మానవ వంశీయ, జాతీయ సమూహాలు |
| -04 | లైంగిక, రక్తసంబంధాను గుణాలను బట్టి వ్యక్తులు |
| -041 | పురుషులు |
| -042 | స్త్రీలు |
| -05 | వయస్సును బట్టి వ్యక్తులు |
| -054 | పిల్లలు |
| -056 | వయోజనులు |
| -06 | ఆర్థిక, సాంఘిక గుణాల స్థాయిని బట్టి వ్యక్తులు |
| -062 1 | ఉన్నత తరగతి |
| -062 2 | మధ్య తరగతి |

| | |
|---|---|
| –062 3 | మధ్య తరగతికి ఒక మెట్టు తక్కువ |
| –062 4 | తక్కువ తరగతి |
| –08 | భౌతిక, మానసిక లక్షణాలు బట్టి వ్యక్తులు |
| –09 | అనేక విషయాలకు చెందిన వ్యక్తులు |
| –090 1 | సిద్ధాంతులు, పరిశోధకులు |
| –091 | గ్రంథ సమీకర్తలు |
| –092 | గ్రంథాలయ సమాచార విజ్ఞానాలకు సంబంధించిన వారు |
| –093 | విజ్ఞాన సర్వస్వ కారులు |
| –096 | చిత్ర వస్తు ప్రదర్శనశాలలతో సంబంధం కలవారు |
| –097 | పత్రికా ప్రచురణ, రచనతో సంబంధం కలవారు |
| –1—9 | నిపుణులు |
| –1 | తత్వశాస్త్రంలో నిపుణులు |
| –2 | మతం |
| –3 | సామాజిక శాస్త్రాలు |
| –4 | భాష |
| –5 | విజ్ఞాన శాస్త్రాలు |
| –6 | సాంకేతిక విజ్ఞానం |
| -7 | కళలు |
| –8 | సాహిత్యం |
| -9 | చరిత్ర భూగోళం తత్సంబంధ విషయాలు |
| –91 | భూగోళం, యాత్రలు |
| –92 | జీవిత చరిత్రలు |
| –93 | పురాతత్వ శాస్త్రం |
| –97 | చరిత్ర |
| -99 | వంశ వృక్షాలు |

# మూడో భాగం

## అనుసూచీలు (షెడ్యూల్సు)

| | |
|---|---|
| 000 | సాధారణ విషయాలు |
| 100 | తత్త్వ శాస్త్రం |
| 200 | మతం |
| 300 | సాంఘిక శాస్త్రాలు |
| 400 | భాషా శాస్త్రాలు |
| 500 | సామాన్య శాస్త్రాలు |
| 600 | సాంకేతిక విజ్ఞాన శాస్త్రాలు |
| 700 | కళలు |
| 800 | సాహిత్యం |
| 900 | సాధారణ చరిత్ర మొ. |

# 13 దశాంశ వర్గీకరణ పథకం (స్థూల రూపం)

| | |
|---|---|
| 000 | సాధారణ విషయాలు |
| 001 | విజ్ఞానం |
| 080 | సాధారణ సంకలనాలు |
| 100 | తత్వశాస్త్రం |
| 150 | మనస్తత్త్వ శాస్త్రం |
| 180 | ప్రాచీన, మధ్యయుగ, ప్రాచ్య, తత్త్వ శాస్త్రాలు |
| 181.4 | భారతీయ తత్త్వ శాస్త్రం |
| 190 | ఆధునిక, పశ్చిమ తత్త్వ శాస్త్రం |
| 200 | మతం |
| 220 | బైబిలు |
| 230 | క్రైస్తవ సిద్ధాంతాలు |
| 294 | భారతీయ మతాలు |
| 294.3 | బౌద్ధ మతం |
| 294.4 | జైన మతం |
| 294.5 | హిందూ మతం |
| 297 | ఇస్లాం మతం |
| 299 | ఇతర మతాలు |
| 300 | సాంఘిక శాస్త్రాలు |
| 301 | సమాజ శాస్త్రం |
| 310 | గణాంక పద్ధతులు, గణాంకాలు |
| 320 | రాజనీతి శాస్త్రం |
| 330 | ఆర్థిక శాస్త్రం |
| 340 | న్యాయ శాస్త్రం |
| 341 | అంతర్జాతీయ న్యాయ శాస్త్రం |
| 350 | పౌర పరిపాలనా శాస్త్రం |

| | |
|---|---|
| 360 | సాంఘిక సమస్యలు, సేవలు |
| 370 | విద్య |
| 380 | వాణిజ్య శాస్త్రం |
| 390 | ఆచారాలు, మర్యాదలు, జానపద విజ్ఞానం |
| 400 | భాష |
| 420 | ఆంగ్ల భాష |
| 491.2 | సంస్కృత భాష |
| 491.43 | హిందీ భాష |
| 491.439 | ఉర్దూ భాష |
| 494.827 (తె.భా) | తెలుగు భాష |
| 494.827 3 | తెలుగు నిఘంటువులు (తె.భా-3) |
| 494.827 5 | తెలుగు వ్యాకరణం (తె.భా-5) |
| 500 | విజ్ఞాన శాస్త్రాలు |
| 510 | గణిత శాస్త్రం |
| 520 | ఖగోళ, తదితర శాస్త్రాలు |
| 530 | భౌతిక శాస్త్రం |
| 539 | ఆధునిక భౌతిక శాస్త్రం |
| 540 | రసాయన శాస్త్రం |
| 550 | భూవిజ్ఞాన శాస్త్రం |
| 560 | పురా జీవ శాస్త్రం |
| 570 | జీవ శాస్త్రాలు |
| 572 | మానవ జాతులు |
| 574 | జీవ శాస్త్రం |
| 580 | వృక్ష సంబంధి శాస్త్రాలు |
| 581 | వృక్ష శాస్త్రం |

590 జంతు సంబంధి శాస్త్రాలు
591 జంతు శాస్త్రం
600 సాంకేతిక విజ్ఞానం
610 వైద్య శాస్త్రాలు
620 ఇంజనీరింగు
630 వ్యవసాయ శాస్త్రం
640 గృహ విజ్ఞాన శాస్త్రం
650 నిర్వహణ శాస్త్రం, తత్సంబంధ సేవలు
657 వ్యాపార గణాంక శాస్త్రం
658 సాధారణ నిర్వహణ
660 రసాయన సాంకేతిక విజ్ఞానం
670 వస్తూత్పాద పరిశ్రమలు
690 భవనాలు
700 కళలు
720 వాస్తు కళ
730 శిల్ప కళ, ప్లాస్టిక్ కళలు
740 చిత్ర లేఖనం
750 చిత్ర కళ
760 ముద్రణ, అద్దకాలు
770 ఛాయా చిత్ర కళ
780 సంగీతం
790 వినోదం, ప్రదర్శన కళలు
800 సాహిత్యం
820 ఆంగ్ల సాహిత్యం
821 ఆంగ్ల కావ్యాలు
822 ఆంగ్ల నాటకాలు
823 ఆంగ్ల నవలలు

| | |
|---|---|
| 891.2 | సంస్కృత సాహిత్యం |
| 891.43 | హిందీ సాహిత్యం |
| 891 439 | ఉర్దూ సాహిత్యం |
| 891.827 (తె.సా) | తెలుగు సాహిత్యం |
| 891.827 1 | తెలుగు కావ్యాలు (తె.సా 1) |
| 891.827 2 | తెలుగు నాటకాలు (తె.సా 2) |
| 891.827 3 | తెలుగు నవలలు, కథలు (తె.సా 3) |
| 900 | సాధారణ భూగోళ శాస్త్రం, చరిత్ర |
| 910 | సాధారణ భూగోళ శాస్త్రం |
| 915.4 | భారత దేశ సాధారణ భూగోళ శాస్త్రం |
| 920 | సాధారణ జీవిత చరిత్ర |
| 930 | సాధారణ ప్రాచీన ప్రపంచ చరిత్ర |
| 934 | ప్రాచీన భారత దేశ చరిత్ర |
| 940 | ఐరోపా చరిత్ర |
| 941 | గ్రేట్ బ్రిటన్ దేశ చరిత్ర |
| 944 | ఫ్రెంచి దేశ చరిత్ర |
| 947 | సోవియట్ యూనియన్ చరిత్ర |
| 950 | ఆసియా చరిత్ర |
| 951 | చైనా చరిత్ర |
| 952 | జపాన్ చరిత్ర |
| 954 | భారత దేశ చరిత్ర |
| 954.84 | ఆంధ్రప్రదేశ్ చరిత్ర |
| 960 | ఆఫ్రికా చరిత్ర |
| 970 | దక్షిణ అమెరికా చరిత్ర |
| 973 | అమెరికా సంయుక్త రాష్ట్రాల చరిత్ర |
| 980 | దక్షిణ అమెరికా చరిత్ర |
| 990 | ఇతర ప్రాంతాల, భూమ్యేతర ప్రపంచాల, పసిఫిక్ సముద్ర ద్వీపాల చరిత్ర |

# 14 000 సాధారణ విషయాలు

పేరును బట్టే ఇందు గల విషయం వ్యక్తమౌతుంది. సర్వసాధారణమైన అనేక విషయాలు ఈ వర్గంలో ఉన్నందున ఆ పేరు వచ్చింది. అంటే ఇవి ఏ ఒక్క ప్రత్యేక వర్గానికి చెందవు. అందుచేత డ్యూయీ ఈ వర్గాన్ని జెనరేలియా క్లాస్ లేదా జెనరాలిటీస్ అన్నాడు. దీన్ని 'మిసెలినీ' అని గూడ అంటారు. అంటే కలగూరగంప అని చెప్పుకోవచ్చు.

దశాంశ వర్గీకరణను రూపొందించే సందర్భంలో డ్యూయీ విశ్వ విజ్ఞానాన్ని తొమ్మిది విభాగాలు చేశారు. అందు ఏ ఒక్క విభాగానికి చెందనివీ, అన్ని విభాగాల ప్రమేయం గల వాటిని సాధారణ విషయాలు అనే ఈ వర్గంలో చేర్చారు.

## విజ్ఞానం. సమాచార విజ్ఞానం

సమాచార విజ్ఞానం, గ్రంథ సూచీ విజ్ఞానం, గ్రంథాలయ శాస్త్రం, చిత్ర వస్తు ప్రదర్శన విజ్ఞానం, గ్రంథ ప్రచురణ మొ. అనేక విషయాలు ఈ వర్గంలో ఉన్నాయి. అలాగే విజ్ఞాన సర్వస్వాలు, పత్రికలు అనేక విషయాలకు చెంది ఉండడం సహజం. ఈ కోవకు చెందినవన్నీ ఒక వర్గంగా ఉంచడం జరిగింది. మొత్తంమీద ఈ వర్గం సాధారణ విషయాలను సమగ్రంగా ప్రతిబింబిస్తుంది.

## కొన్ని విశేషాలు

| వ సం. | ప్రాథమిక వర్గ సంఖ్య విషయం | చేర్చదగింది | ఆధారం |
|---|---|---|---|
| 1 | 011.2 నిర్దిష్ట భాషలలో సాధారణ గ్రంథసూచీలు | భాషా సంఖ్య | 6వ స. ప |
| 2 | 011.625 నిర్దిష్ట వయ స్కుల గ్రంథ సూచి | 054–055 | 7వ స ప |
| 3 | 013 నిర్దిష్ట వర్గ రచయితల గ్రంథ సూచి | 03–87 | 7వ స. ప |
| 4 | 013.89 భూగోళం,చరిత్ర మొ॥ శాస్త్రాలలో నిమగ్నమై ఉన్న రచయిత గ్రంథ సూచి | –9 | 7వ స. ప |
| 5 | 013.9 నిర్దిష్ట ఖండ, ప్రాంత, దేశ స్థానిక రచయితల గ్రంథ సూచి | 1–9 | 2వ స. ప |
| 6 | 014 మారు పేరు రచయితల గ్రంథ సూచి | 031–039 లో 03 పిదప సంఖ్య | అనుసూచి |
| 7 | 015 నిర్దిష్ట ప్రదేశాల గ్రంథ సూచీలు | 1–9 | 2వ స. ప |
| 8 | 015 నిర్దిష్ట ప్రదేశాల గ్రంథ సూచీలు | 011.1–011.7 011 పిదప సంఖ్య | అనుసూచి |

| వ సంఖ్య | ప్రాథమిక వర్గ సంఖ్య విషయం | చేర్చదగింది | ఆధారం |
|---|---|---|---|
| 9 | 016 నిర్దిష్ట విషయ గ్రంథ సూచి | 000–999 | అనుసూచి |
| 10 | 022.31 నిర్దిష్ట గ్రంథాలయ భవనాలు | 027.1–027.8<br>022.31 పిదప | అనుసూచి |
| 11 | 027 సాధారణ గ్రంథాలయాలు | 1–9 | 2వ స. ప |
| 12 | 027.4 పౌర గ్రంథాలయాలు | 1–9 | 2వ స. ప |
| 13 | 039 ఇతర భాషల విజ్ఞాన సర్వస్వాలు | భాషా సంఖ్య | 6వ స. ప |
| 14 | 089 సాధారణ సంకలనాలు | భాషా సంఖ్య | 6వ స. ప |
| 15 | 011 గ్రంథ సూచీలు | 001–009 | 1వ స. ప |
| 16 | 027 సాధారణ గ్రంథాలయాలు | 001–009 | 1వ స. ప |
| 17 | —— మిగతా వాటికి —— | 01–09 | 1వ స. ప |

స.ప: సహాయక పట్టిక (ఉప విభాగాలు)
(ఆగ్జిలియరీ టేబుల్)

000 సాధారణ విషయాలు

001 జ్ఞానం వివిధ రంగాలలోని భావాల చర్చ, జ్ఞాన ప్రగతి చరిత్ర

001.4 జ్ఞాన పరిశోధన

001.5 సైబర్ నెటిక్స్, సంబంధిత శాస్త్రాలు

001.6 డేటా ప్రాసెసింగ్

001.61 సిస్టమ్స్ ఎనాలిసిస్

001.9 వివాదాస్పద విజ్ఞానం

002 పుస్తకం చరిత్ర, వర్ణన, విమర్శనాత్మక ప్రశంస

చారిత్రక గ్రంథ సూచీలను ఇచటే వర్గీకరించాలి.

003 విధానాలు (సిస్టమ్స్)

010 గ్రంథ సూచీ

ఒక అంశంపై గల పుస్తకాల జాబితాను గ్రంథ సూచీ (బిబ్లియోగ్రఫీ) అంటారు. ఒక గ్రంథాలయంలోగల పుస్తకాల జాబితాను గ్రంథాలయ సూచీ లైబ్రరీ (కేటలాగ్) అంటారు.

011 సాధారణ గ్రంథసూచీలు, నిర్దిష్టమైన పరిమితి లేనివి

ఆంధ్ర వాఙ్మయ సూచిక—కాశీనాధుని నాగేశ్వరరావు

011.02 రెఫరెన్సు గ్రంథాల సూచి

తెలుగులో రెఫరెన్సు గ్రంథాలు—వెలగా వెంకటప్పయ్య

011.1 విశ్వజనీన గ్రంథ సూచీలు

011 2 నిర్దిష్ట భాషలలోని సాధారణ గ్రంథ సూచీలు

011.2 మూల సంఖ్యకు సహాయక ఉప విభాగాలలోని భాషా సంకేతం చేర్చవచ్చును.

011.23 జర్మన్ భాషలో సాధారణ గ్రంథ సూచీ

.3 నిర్దిష్ట రూపంలో ప్రచురించిన సాధారణ గ్రంథ సూచి

సాధారణ గ్రంథ సూచీలను ఇచట వర్గీకరించాలి.

.31 రాత ప్రతుల గ్రంథ సూచి

.33 కర పత్రాల గ్రంథ సూచి

.34 ధారావాహిక ప్రచురణల గ్రంథ సూచి

.35 దిన పత్రికల గ్రంథ సూచి

.36 మైక్రో రూప గ్రంథ సూచి

.37 దృశ్య, శ్రవ్య రూప గ్రంథ సూచి

.4 గ్రంథ సూచి స్వభావాన్ని ప్రదర్శించే సాధారణ గ్రంథ సూచీలు

.42 అరుదైన గ్రంథాల గ్రంథ సూచి

.5 నిర్దిష్ట ప్రచురణకర్తల గ్రంథాల గ్రంథ సూచీలు

.52 అంతర్జాతీయ సంస్థల ప్రచురణల గ్రంథ సూచి

.53 ప్రభుత్వ ప్రచురణలు

.54 యూనివర్సిటీల ప్రచురణల గ్రంథ సూచి

.6 నిర్దిష్ట వినియోగదారుల సాధారణ గ్రంథ సూచీలు

.62 బాలల, యువజనుల గ్రంథ సూచి

.625 నిర్దిష్ట వయస్కుల గ్రంథ సూచి

ఈ మూల సంఖ్యకు 7వ, పట్టికలో ఉప విభాగాలను (054 నుంచి –055 వరకు గల సంఖ్యను) చేర్చవచ్చును.
011.624 2 ఆడపిల్లల గ్రంథసూచి.

.63 వికలాంగ వినియోగదారుల గ్రంథ సూచి

.7 నిర్దిష్ట విషయంగల గ్రంథాల గ్రంథ సూచి

పాఠ్య గ్రంథాలు, సిద్ధాంత వ్యాసాలు, అనువాదాలు, వస్తువును బట్టి ఎంపిక చేసిన రచనలు–మొ. గ్రంధ సూచి

012 వ్యక్తుల గ్రంథ సూచీలు

కొడవటిగంటి రచనల సూచి—కేతు విశ్వనాథరెడ్డి

013 నిర్దిష్ట వర్గ రచయితల గ్రంథ సూచీలు,

విషయానికి సంబంధించిన గ్రంధ సూచీలు ఇందు చేరవు.
.03–.87 స్థానంతో నిమిత్తంలేక స్వభావాన్ని బట్టి

రచయితలు. ఈ మూల సంఖ్యకు 7వ, సహాయిక పట్టికలోని 03 నుంచి 87 వరకు గల సంఖ్యలను చేర్చవచ్చును

013 + -042 = 013.042
[మూల సంఖ్య] [7వ పట్టిక] మహిళల గ్రంథ సూచి

013.89 భూగోళం, చరిత్ర-తత్సంబంధ విషయం రచయితల గ్రంథ సూచి

దీనికి సహాయ పట్టిక 7లోని 9వ, సంఖ్యలను చేర్చవచ్చును. 013.893 పురావస్తు శాస్త్రవేత్తల గ్రంథ సూచి

013.9 నిర్దిష్ట ఖండ, ప్రాంత, దేశ, స్థానిక, రచయితల గ్రంథ సూచి

ఇచట 013.9 కు ప్రాదేశిక విభాగాలలో 1-9 వరకు సంఖ్యలను చేర్చవచ్చు. 013 954 భారతీయ రచయితల గ్రంథ సూచి

014 మారు పేర్ల రచయితల గ్రంథ సూచీలు

అనుసూచీలో 031 నుంచి 039 వరకు గల భాషా సంకేతాలను ఇచట చేర్చవచ్చు
014.94827 తెలుగు మారుపేరు రచయితల గ్రంథ సూచి

015 నిర్దిష్ట ప్రదేశాల గ్రంథ సూచీలు

దీనికి ప్రాదేశిక విభాగాలను చేర్చవచ్చు. 015.54 భారత జాతీయ గ్రంథ సూచి. దీనికి '0' చేర్చి అవసరమైతే 011 కు 011.1 నుంచి 011.7 వరకు గల తదుపరి సంఖ్యలను దీనికి చేర్చుకోవచ్చు. 015.540 53 భారత ప్రభుత్వ ప్రచురణల జాతీయ గ్రంద సూచి.

016 నిర్దిష్ట విషయ గ్రంథ సూచీలు

గ్రంథాలయ సూచి. దీనికి అను సూచీలోని ఏ విషయాన్నయినా (సంకేతం 100 - 900 వరకు) సరాసరి చేర్చుకోవచ్చు. హిందూ మతం గ్రంథ సూచి 016.294 5

017 సాధారణ విషయ గ్రంథాలయ సూచీలు

వేటపాలెం సారస్వత నికేతన గ్రంథాలయ సూచి

018 గ్రంథకర్త సూచీలు

019 నిఘంటు సూచీలు

వేమున ఆంధ్ర భాషా నిలయ గ్రంథాలయ సూచి

020 గ్రంథాలయ, సమాచార శాస్త్రాలు

పుస్తకాలు, పత్రిక, దృశ్య శ్రవ్య పరికరాలు, ఇతర రకాల పఠన సామగ్రి సేకరణ, భద్రత వినియోగం—ఇత్యాది అంశాలు ఈవర్గంలో ఉంటాయి.

020.3 గ్రంథాలయ శాస్త్ర నిఘంటువులు, విజ్ఞాన సర్వస్వాలు పదకోశాలు

గ్రంథాలయ భాష—కృష్ణా జిల్లా గ్రంథాలయ సంస్థ

020.6 గ్రంథాలయ సంఘాలు, నిర్వహణ

.621 అంతర్జాతీయ స్థాయి సంఘాలు

.622 జాతీయ స్థాయి సంఘాలు

.623 4 రాష్ట్రస్థాయి సంఘాలు

ఇచట ప్రాదేశిక పట్టిక 2 వాడచ్చు. 30 వ, ఆంధ్ర దేశ గ్రంథాలయ మహా సభలు-నివేదిక 020.623 454 84
ఆంధ్ర దేశ గ్రంథాలయ సేవక మహా సంఘ చరిత్ర—వాజేటి రామచంద్రరావు

.7 అధ్యయనం, అధ్యాపనం

.9 చారిత్రక భౌగోళిక ప్రస్తావన

021 గ్రంథాలయ సంబంధాలు

.2 గ్రంథాలయాలు-సమాజం

.6 గ్రంథాలయ సహకారం, నెట్‌వర్క్స్

.7 గ్రంథాలయ మిత్ర బృందాలు

పశ్చిమ గోదావరి జిల్లా గ్రంథాలయ సంస్థ రీడర్స్ ఫోరమ్స్—నివేదిక

021.8 గ్రంథాలయాలు ప్రభుత్వం

022 గ్రంథాలయ భవనాలు, పరికరాలు

.31 నిర్దిష్ట గ్రంథాలయ భవనాలు

027.1 నుంచి 027.8 వరకు గల ఉప విభాగాలను 022.31కు చేర్చవచ్చును. 022 314 పౌర గ్రంథాలయ భవనాలు

023 గ్రంథాలయ సిబ్బంది, వారి స్థితి గతులు

025 గ్రంథాలయ నిర్వహణ

గ్రంథ సంపాదన, వర్గీకరణ, సూచీకరణ, చదువరులసేవ, బైండింగు భద్రత మొదలైన విషయాలు. ప్రలేఖనా విజ్ఞానాన్ని కూడ ఇచటే వర్గీకరించాలి గ్రంథాలయ విజ్ఞానం—వెలగా వెంకటప్పయ్య

025.1 గ్రంథాలయ నిర్వహణ

.04 సమాచార నిలువ, పునరుద్ధాన వ్యవస్థలు

.06 సమాచార నిలువలో ప్రత్యేకవిధానాలు

మెడ్లార్స్

.1 పాలన

.2 పుస్తకాల సేకరణ, పెంపుదల

.3 గ్రంథ సూచీ విశ్లేషణ, నియంత్రణ

.31 గ్రంథాలయ సూచీ

గ్రంథాలయ సూచీకరణ—పాతూరి విజయకుమార్

.4 విషయ విశ్లేషణ, నియంత్రణ

.42 వర్గీకరణ

.43 సాధారణ వర్గీకరణ విధానాలు

.431 దశాంశ వర్గీకరణ విధానం

దశాంశ వర్గీకరణ విధానం—పౌర గ్రంథాలయ శాఖ

.5 చదువరులకు సేవ

.52 రిఫరెన్సు సేవ

.6 అరువు ఇచ్చే సేవ

.7 పుస్తకాల భద్రత

026 ప్రత్యేక గ్రంథాలయాలు

027 సాధారణ గ్రంథాలయాలు

పౌర గ్రంథాలయాలు, విద్యాలయ గ్రంథాలయాలు, స్వంత గ్రంథాలయాలు మొదలైనవి.

గమనిక:— 027.0 మూల సంఖ్యలుకు ప్రాదేశిక విభాగాల పట్టిక 2 నుంచి సంకేతం చేర్చవచ్చు. 027.034 ప్రాచీన భారత గ్రంధాలయాలు- కొడాలి లక్ష్మీనారాయణ

1 ప్రయివేటు, కుటుంబ గ్రంథాలయాలు

దీనికి ప్రాదేశిక విభాగాలు చేర్చవచ్చు

2 సొంత గ్రంథాలయాలు

3 అద్దె గ్రంథాలయాలు

4 పౌర గ్రంథాలయాలు

43–49 ప్రాదేశిక విభాగాలు

027.441 బ్రిటన్‌లో పౌర గ్రంధాలయాలు

ఇందు –41 ప్రాదేశిక విభాగం

.5 ప్రభుత్వ గ్రంథాలయాలు

.6 ప్రత్యేక సమూహాల, నిర్దిష్ట సంస్థల గ్రంథాలయాలు

.625 పిల్లల గ్రంథాలయాలు

.65 ప్రత్యేక సమూహాలకు ప్రభుత్వ గ్రంథాలయాలు

ఆంధ్రప్రదేశ్ విధాన సభ గ్రంధాలయం

.662 ఆస్పత్రి గ్రంథాలయాలు

.7 కళాశాల, విశ్వవిద్యాలయ గ్రంథాలయాలు

.8 పాఠశాల గ్రంథాలయాలు

.823—.829 నిర్దిష్ట స్థాయి గ్రంథాలయాలు

దీనికి ప్రాదేశిక విభాగాలు చేర్చవచ్చు. ఆంధ్రప్రదేశ్‌లో పాఠశాల గ్రంధాలయాలు 027.825 484

028 పఠన పరికరాలు

చదివే అలవాటు పెంపొందించడానికి సాధనాలు గ్రంధ సమీక్షలు, గ్రంధాలు చదవడం మొ॥

1 సమీక్షలు

.9 చదివే అలవాటు పెంపొందించడం

చదవడం ఎలా ? — గొ॥ రెపాటి వెంకట సుబ్బయ్య

030 సాధారణ విజ్ఞాన సర్వస్వాలు

వీటిని తొలుత భాషల వారీగా విభజించాలి

031 అమెరికన్ సాధారణ విజ్ఞాన సర్వస్వాలు

ఎన్‌సైక్లోపీడియా అమెరికానా (అమెరికన్ ఇంగ్లీషు)

032 ఇంగ్లీషు సాధారణ విజ్ఞాన సర్వస్వాలు

ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా (ఇంగ్లీషు)

039 ఇతర భాషల సాధారణ విజ్ఞాన సర్వస్వాలు

గమనిక 1 : భాషా సంకేతము 2–9ని, 6వ పట్టిక నుంచి గ్రహించి మూల సంఖ్య 039 కి చేర్చాలి.

039 + – 91431 హిందీ భాష = 039.914 31
హిందీ విజ్ఞాన సర్వస్వం

039.94827 తెలుగు విజ్ఞాన సర్వస్వం 14వ, సంపుటం

గమనిక 2: ఒక విషయానికి సంబందించిన విజ్ఞాన సర్వస్వాలను ఆ విషయాలచెంతనే ప్రామాణిక ఉప విభాగాల సాయంతో వర్గీకరించాలి

020 + — 03 = 020.3 గ్రంథాలయ
[గ్రంథాలయ విజ్ఞాన సర్వస్వం శాస్త్ర విజ్ఞాన
శాస్త్రం] [పట్టిక 1 నుంచి] సర్వస్వం

050 సీరియల్ ప్రచురణలు వాటి అనుక్రమణికలు

పత్రికలను గూడ ఇచట వర్గీకరించాలి. భాషా సంకేతాలను ఇచట చేర్చవచ్చును

059 ఇతర భాషలలో

గమనిక : భాషా సంకేతం 2–9ని, పట్టిక 6 నుంచి మూల సంఖ్య 059కి చేర్చాలి

–94827 తెలుగు భాష
059 + 94827 = 059.94827 = తెలుగు పత్రిక
భారతి – మాసపత్రిక

060 సాధారణ సంఘాలు, చిత్రవస్తు ప్రదర్శన శాలలు

వాటి చరిత్ర, ఛార్టర్లు, నియమావళి, సభ్యుల పట్టికలు, పరిపాలనా నివేదికలు, సభల నివేదికలు. ఏదైనా ఒక విషయానికి పరిమితమైన సంఘాలను ప్రామాణిక ఉప విభాగం-067తో విషయం చెంత చేర్చడం మంచిది.

020.6 గ్రంథాలయ సంఘం

069 చిత్రవస్తు ప్రదర్శన శాలలు

సాలార్‌జంగ్ మ్యూజియం హైదరాబాదు 069.095 484

070 పత్రికా రచన, ప్రచురణ, దిన పత్రికలు

పత్రికా రచన – నర్రావుల సుబ్బారావు

070.5 పుస్తక ప్రచురణ

071_079 పుస్తక ప్రచురణ దేశాల వారగా విభజన

079 ఇతర దేశాలలో దిన పత్రికలు

గమనిక : ప్రాదేశిక విభాగ సంకేతం 1–9ని, 2వ పట్టిక నుంచి మూల సంఖ్య 079కి చేర్చాలి

079.54 భారతదేశంలో దినపత్రికలు

ఇచట 079 పిదప భౌగోళిక విభాగం చేర్చాలి ఇలా మిగతావి చేర్చుకోవచ్చు

080 సాధారణ సంకలనాలు

సాదారణ వ్యాసాలు, ఉపన్యాసాలు, సూక్తులను, ఇంటర్వ్యూలను ఇచట వర్గీకరించాలి. 081 నుంచి 089 వరకు భాషల వారీగా విభజించాలి

081 అమెరికన్ సంకలనాలు

ఎమర్సన్ వ్యాసాలు. అను: బి. వి. సింగరాచార్య

082 ఆంగ్ల సంకలనాలు

పసిద్ధ ఆంగ్ల వ్యాసాలు

| | |
|---|---|
| 083 | జర్మన్ సంకలనాలు |
| 084 | ఫ్రెంచి సంకలనాలు |
| 085 | ఇటాలియన్ సంకలనాలు |
| 086 | స్పానిష్ సంకలనాలు |
| 087 | రష్యన్ సంకలనాలు |
| 088 | స్కాండినేవియన్ సంకలనాలు |
| 089 | ఇతర భాషల సంకలనాలు |

గమనిక:— ఇచట భాషల సంకేతాన్ని 2—9ని, 6వ, పట్టిక నుంచి మూల సంఖ్య 089కి చేర్చాలి

| | |
|---|---|
| 089.94827 | తెలుగు సంకలనాలు |

కొత్తా పాతా — నార్ల వెంకటేశ్వరరావు. ఇచట భాషా సంకేతం చేరింది

| | |
|---|---|
| 090 | రాతప్రతులు, అరుదైన గ్రంథాలు, చరిత్ర వర్ణన, విమర్శనాత్మక ప్రశంస |
| 091 | రాత ప్రతులు |
| 098.1 | నిషేధించిన గ్రంథాలు |

— 0 —

13)

## 15 100 తత్వశాస్త్రం (దర్శనాలు)

ప్రాచీన కాలం నుంచీ భారతదేశంలో తాత్విక గ్రంథాలు ఉన్నాయి. వీటినే దర్శనాలు అంటారు. ప్రపంచంలో కనుపించే భిన్న విషయ సముదాయంలో మౌలిక సమస్యలకు లౌకిక రీతిలో సమాధానం ఇచ్చేవాటిని దర్శనాలు అంటారు. ఇందు ప్రయోగం కంటే ఆలోచన, పరిశీలన, తర్కం ప్రధానంగా ఉంటుంది.

డ్యూయీ రూపొందించిన దశాంశ వర్గీకరణ విధానంలో పాశ్చాత్య తత్వ శాస్త్రానికి విశేష ప్రాధాన్యం ఇచ్చారు. దీనిలోనే ప్రత్యేక విషయ ప్రాముఖ్యం గల మనోవిజ్ఞాన శాస్త్రం, తర్క శాస్త్రం మొదలైన వాటిని గూడ చేర్చారు. ప్రపంచ వ్యాప్తంగా ప్రాపకంగల భారతీయ దర్శనాలకు తుది విభాగం 190లో స్థానం కల్పించారు. దీనికి భౌగోళిక విభాగాలను చేర్చడం వలన భారతీయ తత్వశాస్త్రాల సంకేతాలను సాధింపవచ్చును. ఈ విధానంలో ఇవన్నీ ఒకచోట కిక్కిరిసి ఉన్నప్పటికీ మొత్తం మీద అనేక ప్రయోజనాల దృష్ట్యా ఈలోపాలను సర్దుబాటు చేసుకోక తప్పదు. ప్రస్తుత సంస్కరణలో ఇది కొంత మెరుగ్గా ఉంది.

### కొన్ని విశేషాలు

| వ సంఖ్య | మూల వర్గ సంఖ్య విషయం | చేర్చతగింది | ఆధారం |
|---|---|---|---|
| 1 | 155.45 అసాధారణ బాలల మనో విజ్ఞానం | 371.91-371.97 లో 371.9 తరువాత సంఖ్యలు | అనుసూచి |

| వ సంఖ్య | మూల వర్గ సంఖ్య విషయం | చేర్చతగింది | ఆధారం |
|---|---|---|---|
| 2 | 181.04-.09 నిర్దిష్ట మతాలపై ఆధారపడిన తత్వ శాస్త్రాలు | 29 పిదప సంఖ్య 294- 299 లో మూల సంఖ్య 181.0 | అనుసూచి |
| 3 | 199 ఇతర దేశాల తత్వ శాస్త్రం | 4-9 | 1వ, ప |
| 4 | 181 ప్రాచ్య తత్వ శాస్త్రం | 001-009 | 1వ, ప |
| 5 | -మిగతా వాటికి | 01-09 | 1వ, ప |

అనుసూచి

190 తత్వ శాస్త్రం, తత్సంబంధ విషయాలు

101-109 ప్రామాణిక ఉప విభాగాలు

103 తాత్విక నిఘంటువులు

110 అధి భౌతిక శాస్త్రం (మెటాఫిజిక్స్)

సత్తు, అసత్తులు, జ్ఞాన విభజన, విశ్వశాస్త్రం (కాస్మాలజీ)
జడ,చేతనాలు మొదలైనవి

111 ప్రకృతి తత్వం

113 విశ్వ శాస్త్రం (కాస్మలజీ)

120 జ్ఞాన శాస్త్రం, కారణత, మానవ జాతి

121 జ్ఞాన సిద్ధాంతం

128 ఆత్మ, ఆత్మతత్త్వం

130 పరా మనస్తత్వ శాస్త్రం, తదితర శాస్త్రాలు

133 పరా మనస్తత్వ శాస్త్రం (పేరా సైకాలజి)

రహస్య వాదం (అక్కల్టిజం)

133.4 మంత్ర జాలం

133.43 మాజిక్

133.5 జ్యోతిషం

జాతక మార్తాండము—ఆకెళ్ళ వెంకట శాస్త్రి

133.51 భూతాలు

133.6 సాముద్రికం

హస్త సాముద్రిక సంగ్రహం — మహేంద్రవాడ వీర గణపతి శాస్త్రి

133.608 సాముద్రిక శాస్త్ర వ్యాసాలు

140 తత్వశాస్త్రంలో నిర్దిష్ట దృక్పథాలు

141 ఆదర్శవాదం, తత్సంబంధ సిద్ధాంతాలు

142 విమర్శనాత్మక తత్వశాస్త్రం

144 మానవతా వాదం

150 మనో విజ్ఞాన శాస్త్రం (సైకాలజీ)

మనోవిజ్ఞాన శాస్త్రము—పరిచయము—తెలుగు అకాడమి

155 భేదాత్మక, జన్యుశాస్త్ర మనో విజ్ఞాన శాస్త్రం

155.4 బాల మనో విజ్ఞాన శాస్త్రం

(ఛైల్డ్ సైకాలజీ)

155.45 అసాధారణ బాలల మనో విజ్ఞానం

371.91నుంచి 371.97 వరకుగల శ్రేణిలోని 371.9తరువాత

సంఖ్యలను ఇచట చేర్చుకోవచ్చు. 155.455 ప్రజ్ఞావంతులైన బాలల మనో విజ్ఞానం

157 అపసామాన్య మనో విజ్ఞాన శాస్త్రం (ఎబ్నార్మల్ సైకాలజీ) తెలుగు అకాడమి

158.7 పారిశ్రామిక మనోవిజ్ఞానశాస్త్రం (ఇండస్ట్రియల్ సైకాలజి)

160 తర్కం (లాజిక్)
తర్క శాస్త్రము—తెలుగు అకాడమి

170 నీతిశాస్త్రం (మోరల్ సైన్సు)
రఘునాధీయము — మాదిరాజు రఘునాధరావు. నీతిశాస్త్రము—తెలుగు అకాడమి

171 పద్ధతులు-సిద్ధాంతాలు

172 రాజకీయ నీతి

173 కుటుంబ నీతి
వివాహం, విడాకులు, తల్లిదండ్రుల బాధ్యతలు, గృహ జీవనం

174 వృత్తులు, ఉద్యోగ దర్మాలు

177 సాంఘిక నీతి

180 ప్రాచీన, మాధ్యమిక, ప్రాచ్య తత్వశాస్త్రం

181 ప్రాచ్య తత్వశాస్త్రం
కన్ఫ్యూషియస్ సుభాషితములు(సాహిత్యఅకాడమి)181.095 12

181.04-09 నిర్దిష్ట మతాలకు సంబంధించిన తత్వాలు
ఇచట 294-299 వరకు గల సంకేతాలలో 29 అంకెల తర్వాత భాగాన్ని 181.0 తర్వాత చేర్చాలి. 181.0 + 43
= 181.043

181.482 శంకారాచార్య (అద్వైతం)

శంకరాద్వైతం — త్రిపురనేని వెంకటేశ్వరరావు

181.483 రామానుజాచార్య (విశిష్టాద్వైతం)

ఆంధ్ర శ్రీభాష్యం—కందాడై శేషాచార్యులు

181.484 ద్వైత సిద్ధాంతం

181.484 1 మధ్వాచార్య (ద్వైత సిద్ధాంతం)

విష్ణుతత్వ వినిర్ణయం—మధ్వాచార్యులు

181,484 2 భేదాభేదం

181.484 3 నింబార్క (ద్వైతాద్వైతం)

ద్వైతా ద్వైత దర్శనములు—తాతా సుబ్బారాయ శాస్త్రులు

181.484 4 వల్లభాచార్య (శుద్ధాద్వైతం)

అణుభాష్యం (బ్రహ్మ సూత్రముల మీద భాష్యం) వల్లభాచార్యులు

182 సోక్రటీసు పూర్వ తత్వశాస్త్రం

183 సోక్రటీస్, తదితరులు

సోక్రటీస్ అమరవాణి—అను : పిలకా గణపతి శాస్త్రి

184 ప్లేటో తత్వ శాస్త్రం

జేగంటలు—జి.వి. కృష్ణారావు

185 అరిస్టాటిల్ తత్వశాస్త్రం

186 స్కెప్టిక్ తత్వశాస్త్రం

187 ఎపిక్యూరియన్ తత్వశాస్త్రం

190 ఆధునిక పశ్చిమ దేశ తత్వశాస్త్రం

క్రైస్తవ తత్వశాస్త్రం, ఆధునిక తత్వశాస్త్రం, పశ్చిమ దేశ తత్వ శాస్త్రం, ఐరోపా తత్వశాస్త్రం పైగల సమగ్ర గ్రంథాలను ఇచట వర్గీకరించాలి. సంకేతాన్ని మరింత సంగ్రహపరిచే ఉద్దేశం ఉంటే

వర్గ సంఖ్యలో మొదటి రెండంకెల పిదప—దేశంలోని మొదటి అక్షరాన్ని చేర్చవచ్చు. ఉదా:– 19M లేదా 19 మె (మెక్సికో) ఇది ఐచ్ఛికం. ప్రాచీన, మధ్యయుగ సంబంధ ప్రాచ్య తత్వ శాస్త్రాలను మాత్రం 180 లోనే వర్గీకరించాలి

191 అమెరికా, కెనడా తత్వ శాస్త్రాలు

ఇచట ఉత్తర అమెరికా తత్వశాస్త్రాలు మాత్రం వర్గీకరించాలి

192 బ్రిటీషు దీవుల తత్వ శాస్త్రం

193 జర్మనీ, ఆసియా తత్వశాస్త్రం

194 ఫ్రాన్సు తత్వశాస్త్రం

195 ఇటలీ తత్వశాస్త్రం

196 స్పెయిన్, పోర్చుగల్ తత్వశాస్త్రం

197 రష్యా, ఫిన్‌లాండ్ తత్వశాస్త్రం

198 స్కాండినేవియా తత్వశాస్త్రం

199 ఇతర దేశాల తత్వశాస్త్రం

దీనికి ప్రాదేశిక విభాగ సంకేతం 4–9ని, 2వ పట్టిక నుంచి చేర్చ వచ్చు. మెక్సికో – తత్వశాస్త్రం 199+–72 = 199.72 యూరోపా తత్వశాస్త్రాన్ని 190 లోనే వర్గీకరించాలి

— o —

## 16 200 మతం

మమత కలది మతం. మానవత గలది మతం. మానవుని అంతిమ లక్ష్య సాధనకు మార్గదర్శకమైనది మతం. దీనికి ప్రయోగం, హేతువు ప్రధానం కాదు. నమ్మకం, ఆచరణ ప్రధానం. భారతీయ మతాలన్నీ మానవుని అంతిమ సౌఖ్యానికి దారితీసేవిగా ఉంటాయి. ఒక అలౌకిక చింతనకు మార్గదర్శకంగా ఉంటాయి.

డ్యూయీ ఈ విధానంలో క్రైస్తవ మతానికి విశేష ప్రాధాన్యం ఇచ్చారు. దాదాపు ఈ వర్గమంతా ఆ మతం తాలూకు విశేషాలతో నిండి ఉంది. ప్రపంచంలోని క్రైస్తవేతర మతాలకు 290 లో స్థానం కల్పించారు. ఇది సమంజసం కాదని విమర్శకులు భావించారు. భారతదేశంలో ఉద్భవించి, వ్యాప్తిచెందిన మతాలకు 294లో ప్రత్యేకంగా వివరించారు. ఇంతకు ముందుకంటే ప్రస్తుత సంస్కరణలో ఈ విభాగం కొంత మెరుగుగా ఉంది. ఏమైనప్పటికీ భారతీయ మతాల తాలూకు గ్రంథాలన్నీ ఒక దరికి వచ్చే అవకాశం ఉంది.

### కొన్ని విశేషాలు

| వ సంఖ్య | మూల వర్గ సంఖ్య విషయం | చేర్చదగింది | ఆధారం |
|---|---|---|---|
| 1 | 220.5 ఆధునిక భాషలలో బైబిల్ | భాషా సంఖ్య | 6వ, ప |
| 2 | 294.56—.57 హిందూ మతగురువులు | 291.6—291.7 శ్రేణిలో 291 తరువాత అంకెలు | అనుసూచి |

| వ సం | మూల వర్గ సంఖ్య విషయం | చేర్చబడినది | ఆధారం |
|---|---|---|---|
| 3 | 294.51-.53 హిందూ మత సిద్ధాంతాలు-పూజలు | 291.1-291.3 శ్రేణిలో 291 పేదవ సంఖ్యలు | అనుసూచి |
| 4 | 292 గ్రీకు, రోమన్ మతం | .001-.009 | 1 వ, ప |

## అనుసూచి

200 మతం

సర్వమత సార సంగ్రహము - షేక్ మీరా జాన్

200.1 మత సిద్ధాంతం-తత్వం

ధర్మోద్ధరణ - సర్వేపల్లి రాధాకృష్ణన్ — అను:బద్దేపూడి రాధా కృష్ణ. ఇలాగే పిగలా ప్రామాణిక ఉప విభాగాలు ఉంటాయి

210 మానవుడు — మతం

211 దేవుడు

211.3 ఆస్తికత్వం

ఆస్తికవాదము — గోపదేవ్

211.4 హేతువాదం (రేషనలిజం)

211.6 హ్యూమనిజం

నవ్య మానవ వాదం — ఆవుల గోపాల కృష్ణమూర్తి

211.8 నాస్తికత్వం

దేవుని పుట్టు పూర్వోత్తరాలు —గోపరాజు రామచంద్రరావు

212 దైవ స్వభావం

212.52 దివ్య జ్ఞానం

దివ్య జ్ఞానము — అనీబీసెంటు — అను : సారంగు లక్ష్మి నరసింహారావు

| | |
|---|---|
| 213 | సృష్టి |
| 214 | దైవ నిర్ణయం, విధి |
| 215 | శాస్త్రం |
| | మతం : శాస్త్రం : పురాణం — రావిపూడి వెంకటాద్రి |
| 217 | పూజ , ప్రార్థనలు |
| 220 | బైబిలు |
| 220.5 | ఆధునిక భాషలలో బైబిలు |
| | దీనికి భాషా సంకేతాన్ని 6వ పట్టికనుంచి చేర్చుకోవచ్చు 220.5 +–94827 = 220.594 827తెలుగుబైబిలు |
| 230 | క్రైస్తవ సిద్ధాంతాలు |
| | జీసస్ సందేశం — లియో టాల్‌స్టాయి — అను లక్ష్మీనారాయణ |
| 240 | క్రైస్తవ భక్తి సిద్ధాంతాలు |
| | భక్తి గీతములు — క్రైస్తవ వాఙ్మయ సమాజం |
| 250.280 | క్రైస్తవ చర్చి |
| 290 | ఇతర మతాలు, తులనాత్మక పరిశీలన |
| 291 | తులనాత్మక పరిశీలన |
| | మన మతములు—మన ప్రవక్తలు—కప్పగంతుల సత్యనారాయణ |
| 292 | గ్రీకు, రోమన్ మతం |
| 293 | జర్మనీ మతం |
| 294 | భారతీయ మతాలు |
| 294.3 | బౌద్ధ మతం |
| | బుద్ధ పురాణము — దుగ్గిరాల బలరామ కృష్ణయ్య |
| .34 | బౌద్ధ బోధలు, సిద్ధాంతాలు |
| .36 | మతాచార్యులు |

.38 ఆధార గ్రంథాలు

.382 పవిత్ర గ్రంథాలు

త్రిపిటకాలు — దమ్మపదము అను: వాసిరెడ్డి మర్గా సదాశివేశ్వర ప్రసాదు

.383 మౌఖిక సంప్రదాయాలు

.39 సంస్కరణ ఉద్యమాలు

.391 హీనయాన బౌద్ధం

.392 మహాయాన బౌద్ధం

294.4 జైన మతం

జైన మత తత్వసారము — పూరణ్ చంద్ శాంశాఖా. అను: కొనుకొల్లు జనార్దన శర్మ

294.5 హిందూ మతం

హిందూమతము — జటా వల్లభుల పురుషోత్తం

.51—,53 మత సిద్ధాంతాలు, పూజలు

.53 పూజా విధానం

ఆరాధన విధి — ముదిగొండ నాగ లింగశాస్త్రి

.54 వ్యక్తిగత మతం

.55 తెగలు, సంస్కరణ ఉద్యమాలు

.551 తొలి ఉద్యమాలు

294.551 2 వైష్ణవం

నారద భక్తి సూత్రాలు — అను: పాటిలు తిమ్మారెడ్డి

294.551 3 శైవం

శివార్క మణి దీపిక — అప్పయ్య దీక్షితులు

294.551 4 శాక్తేయం

(తాంత్రిక హిందూ మతం) సౌందర్యలహరి — ఆది శంకరులు

| | |
|---|---|
| 294.551 5 | గణపతి |
| | గణపతి — జానమద్ది హనుమచ్ఛాస్త్రి |
| .551 6 | షన్ముఖి |
| 294.555 | రామకృష్ణ ఉద్యమం |
| | శ్రీరామకృష్ణ బోధమృతం — అను: చిరంతనానంద స్వామి |
| 294.556 | సంస్కరింపబడిన హిందూ మతం |
| 294.556 2 | బ్రహ్మ సమాజం |
| | రాజారామమోహనరాయ్ |
| 294.556 3 | ఆర్య సమాజం |
| | సత్యార్థ ప్రకాశిక — దయానంద సరస్వతి |
| 294.56 | హిందూమత గురువులు, సంస్థలు, కార్యకలాపాలు |
| | 291.6 నుంచి 291.7 వరకు గల శ్రేణిలోని 291 తరువాత విభాగాలను ఇచట మూల సంఖ్య 291.5కు చేర్చుకోవచ్చు. హిందూ మత గురువులు 294.561 |
| 294.592 | పవిత్ర గ్రంథాలు |
| 294.592 1 | వేదాలు |
| | చతుర్వేద పరమ రహస్యము — పీసపాటి లక్ష్మావధాని |
| .592 12 | ఋగ్వేదం |
| | ఋగ్వేదము — అను: బంకుపల్లె మల్లయ్య శాస్త్రి |
| .592 13 | సామ వేదం |
| | సామవేదము — అను: బంకుపల్లె మల్లయ్య శాస్త్రి |
| .592 14 | యజుర్వేదం |
| | యజుర్వేద భాష్యము — వ్యాఖ్య: స్వామి దయానంద సరస్వతి అను: పాలడుగు శేషాచలాచార్య, అన్నె కేశవార్య శాస్త్రి |

| | |
|---|---|
| 294.592 15 | అధర్వణ వేదం |
| | 294.150 8 అధర్వణవేద వ్యాసాలు, ఉపన్యాసాలు |
| .592 18 | ఉపనిషత్తులు |
| | ఉపనిషచ్చంద్రిక — రాయప్రోలు లింగన సోమయాజి |
| .592 2 | రామాయణం |
| .592 3 | మహాభారతం |
| .592 4 | భగవద్గీత |
| | శ్రీమద్భగవద్గీత — మలయాళస్వామి |
| 592 5 | పురాణాలు |
| | అష్టాదశ పురాణములు— వోలేటి వెంకట లక్ష్మీ నృసింహశర్మ |
| | భాగవతం — పోతన |
| .592 6 | ధర్మ శాస్త్రాలు (స్మృతులు) |
| | మనుస్మృతి — వ్యాఖ్య: నే. పార్థసారథి అయ్యంగారు |
| 294.6 - | సిక్కు మతం |
| 296 | యూదుమతం |
| 297 | ఇస్లాం మతం |
| | అహ కామిల్ (ఇస్లాం మత ధర్మములు) — మహమ్మద్ అబ్దుల్ గపూర్ |
| 297.122 | కొరాన్ |
| | కురాను షరీఫ్ — అను : చిలుకూరి నారాయణరావు |
| 299 | ఇతర మతాలు |
| | చైనా, టిబెట్ మొ॥ దేశాలలోనివి |

# 17 300 సాంఘిక శాస్త్రాలు

మానవుడు సంఘజీవి. చిరకాలం నుంచి సంఘ జీవనానికి అలవాటు పడ్డాడు. పరిసరాలను, వనరులను అభివృద్ధి చేసుకొని సాంస్కృతికంగా పెరిగాడు. ఈ పెరుగుదలకు తోడ్పడిన శాస్త్రాలను సాంఘిక శాస్త్రాలు (సోషల్ సైన్సెస్) అంటారు.

గణాంకాలు, రాజనీతి, అర్థ శాస్త్రం, ప్రభుత్వ నిర్వహణ, వాణిజ్యం మొదలైన అనేక అంశాలు ఇందున్నాయి. జానపదాలకు, జానపద సాహిత్యానికి చెందిన విషయాలు గూడ ఇందు చేర్చడం గమనించ దగిన అంశం.

ఈ విభాగంలో 301 నుంచి 307కు సంబంధించిన అంశాలు ప్రత్యేకంగా విస్తృతీకరించాక 19వ, సంస్కరణకు అనుబంధంగా 1981 లో ప్రచురించడం జరిగింది.

## కొన్ని విశేషాలు

| వ సం | మూల వర్గ సంఖ్య, విషయం | చేర్చదగింది | ఆధారం |
|---|---|---|---|
| 1 | 304.8 జనాభాల కదలిక | 3-9 | 2వ, ప |
| 2 | 312.1 జనాభా జననాలపై | 1-9 | 2వ, ప |
| 3 | 327.3-.9 నిర్దిష్ట దేశాల మధ్య విదేశీ విధానాలు | 3-9 రెండుదేశాల మధ్య సున్న | 2వ, ప |

| వ సం | మూల వర్గసంఖ్య విషయం | చేర్చదగింది | ఆధారం |
|---|---|---|---|
| 1 | 328.4-9 ఆధునిక ప్రపంచంలో శాసన సభలు | 4-9 | 2వ,ప |
| 5 | 341.026 6 రెండు దేశాల మధ్య సంధి పత్రాలు | రెండు దేశాల మధ్యసున్న | 2వ,ప. |
| 6 | 342.3-9 వివిధదేశాల రాజ్యాంగాలు | 3-9 | 2వ, ప |
| 7 | 398.9 సామెతలు | భాషా సంఖ్య | 6వ, ప |
| 8 | 300 సామాజిక శాస్త్రాలు | 001-009 | 1వ, ప |
| 9 | 333 భూస్వామ్యం | 001-009 | ,, |
| 10 | 335 సామ్యవాదం | 001-009 | ,, |
| 11 | 336 ప్రభుత్వ ద్రవ్యం | 001-008 | ,, |
| 12 | 343 ఇతర పౌర న్యాయశాస్త్రం | 001-009 | ,, |
| 13 | 345 అపరాధ న్యాయ శాస్త్రం | 001-009 | ,, |
| 14 | 348 చట్టాలు, నియమాలు | 001-009 | ,, |
| 15 | 351 కేంద్ర ప్రభుత్వాలు | 0001-0009 | ,, |
| 16 | 380 వాణిజ్యం | 001-009 | ,, |
| 17 | —— మిగతా వాటికి | -01-09 | ,, |

**అనుసూచీ**

300 సాంఘిక శాస్త్రాలు. సమాజ కార్యకలాపాలకు, సంస్థలకు సంబంధించిన సమగ్ర శాస్త్రాలు

సాంఘిక విజ్ఞానం — ధన్యంరాజు అప్పారావు

300.1—300.9 ప్రామాణిక ఉప విభాగాలు

300.8 సమాజశాస్త్ర వ్యాసాలు

ప్రామాణిక విభాగాలకు ముందు ఒక సున్న అదనంగా చేరింది. దీనిని గమనించాలి

301 సామాజిక శాస్త్రం. మానవ స్వభావ శాస్త్రం (యాంత్రోపాలజీ)

సమాజంపై గల సమగ్ర గ్రంథాలను ఇచట వర్గీకరించాలి.

సామాజిక శాస్త్రం—ఖండవల్లి బాలేందు శేఖరం

.7 సమాజాల రకాలు

302 సాంఘిక పరస్పర చర్యలు

సాంఘిక మనో విజ్ఞాన శాస్త్రం

303 సాంఘిక పరిణామాలు

4 సాంఘికమైన మార్పు

6 ఘర్షణ

సహాయనిరాకరణోద్యమాలు

304 సాంఘిక పరిణామంలో సంబంధాలు

.2 మానవ ఆవరణ శాస్త్రం (హ్యూమన్ ఇకాలజీ)

.6 జనాభా

జనాభా సమస్యలు – పి సత్యనారాయణ

.66 జనాభా నియంత్రణ

భారత జనాభా – కుటుంబ నియంత్రణ – పి వేదవతి

.8 జనాభా కదలికలు

.83–.89 ప్రాదేశిక విభజన (2వ పట్టికను వాడాలి)

భారత దేశంలో జనాభా వలసలు 304.809 54

గమనిక: ఒకదేశం నుంచి మరోదేశానికి వలస పోయినపుడు ప్రాదేశిక విభాగాల మధ్య అనుసంధానంగా సున్న చేర్చాలి. చైనా దేశం నుంచి భారత దేశానికి వలస : 304.854 051

305 సాంఘిక వ్యవస్థ (సంఘ నిర్మాణం)

సాంఘిక సమూహాలు, అల్ప సంఖ్యాక వర్గాలు, స్త్రీ పురుషుల మధ్య అసమానతలు, వయస్సు, భాష, జాతివృత్తుల సమస్యలు ఇచట చేర్చాలి

.3 పురుషులు

.4 స్త్రీలు

స్త్రీల సమస్యలు — మల్లాది వెంకట సుబ్బమ్మ. స్త్రీల ఎన్నికలను 324.623, స్త్రీ విద్యను 376; స్త్రీల ఆర్థిక సంబంధ వృత్తులను 331.4 లోనూ వర్గీకరించాలి

306 సంస్కృతి, సంస్థలు

మన సంస్కృతి సి రాజగోపాలాచారి

.1 ఉప సంస్కృతులు

.4 సంస్కృతిక సంస్థలు

.6 మత సంస్థలు

.8 వివాహం, కుటుంబం

పెళ్ళి దాని పుట్టు పూర్వోత్తరాలు

307 సమాజాలు (కమ్యూనిటీస్)

310 సాంఖ్యక శాస్త్రం, (స్టాటిస్టిక్స్) గణాంకాలు

312 జనాభా సాంఖ్యక శాస్త్రం (స్టాటిస్టిక్స్ ఆఫ్ పాపులేషన్)

314 - 319 ప్రాదేశిక విభజన

314 ఐరోపా సాధారణ గణాంకాలు

315 ఆసియా సాధారణ గణాంకాలు

315.4 భారతదేశ ” ”

316 ఆఫ్రికా ” ”

317 అమెరికా ” ”

320 రాజనీతి శాస్త్రం (పొలిటికల్ సైన్సు)

రాజనీతి — మామిడిపూడి వెంకటరంగయ్య

320.01-320.09 ప్రామాణిక ఉపవిభాగాలు

320.01 రాజనీతి విచారము— తెలుగు అకాడమీ

320.1 రాజ్య విధానం

ఆదర్శ రాజ్యం. ప్లేటో—అను: జి.వి.కృష్ణరావు

320.2 ప్రభుత్వ విధానం

.3 తులనాత్మక ప్రభుత్వాలు

.4 ప్రభుత్వ నిర్మాణం, విధులు, కార్యాకలాపాలు

320.5 రాజనీతి సిద్ధాంతాలు, భావాలు

320.531 సామ్యవాదం

.532 కమ్యూనిజం

320. 532 05 కమ్యూనిజం—మాస పత్రిక

.532 2 మార్క్సిజం-లెనినిజం

మార్క్సిజం అంటే ఏమిటి—ఎన్ ఇన్నయ్య

533 ఫాసిజం

5 గాంధీయిజం

గాంధీ తత్వం—కోగంటి రాధాకృష్ణమూర్తి

8 స్థానిక ప్రభుత్వాలు

స్థానిక సంస్థలు:ఆంధ్రప్రదేశ్—పి సత్యనారాయణ

321 ప్రభుత్వాల దేశాల రకాలు

.01 యునిటరీ స్టేట్స్

.02 ఫెడరల్ స్టేట్స్

.03 సామ్రాజ్యాలు

321.1 నిరక్షరాస్య ప్రజల ప్రభుత్వాలు, ప్రాచీన రూప ప్రభుత్వాలు

321.3 భూస్వామ్య పద్ధతి
భూస్వామ్య విధానం — వి వి ఎల్ నరసింహారావు

4. విశుద్ధ ప్రజాస్వామ్య ప్రభుత్వాలు
ప్రజాస్వామ్య భావనా శక్తి — పి వి ప్రసాదరావు

322 ప్రభుత్వం - సామాజిక సంస్థలు
323 ప్రభుత్వం - ప్రజలు
(ఆంతరంగిక రాజనీతి)

323.4 పౌరహక్కులు
ప్రాథమిక సత్వములు — సురవరం
ప్రతాపరెడ్డి స్వాతంత్ర్య దర్శనము — స్టూవర్ట్ మిల్
అను : దుగ్గిరాల రామమూర్తి

323.5 రాజకీయ హక్కులు
ప్రజావసరాలను ప్రభుత్వానికి
విన్నవించే హక్కులు, పదవులను స్వీకరించే హక్కులు

323.6 పౌరసత్వం
సౌరుడుగా విదులు, బాధ్యతలు

324 రాజకీయ కార్యాచరణ (పొలిటికల్ ప్రోసెస్)
.1 అంతర్జాతీయ సంస్థ వాటి కార్య కలాపాలు
.2 రాజకీయ పార్టీలు

324.24—.29 ఆధునిక ప్రపంచంలోని వివిధ రాజకీయ పార్టీలు
గమనిక 1: 2వ పట్టికనుంచి ప్రాంతీయ సంకేతాన్ని మూల సంఖ్య 324.2కు చేర్చాలి
గమనిక 2 : మన గ్రంథాలయంలో పుస్తకాలుండగలరాజకీయ పార్టీల పేర్లు అకారాది క్రమంలో వుంచ వలసి ఉంటుంది

తెలుగుదేశం పార్టీ
భారత జాతీయ కాంగ్రెస్ పార్టీ
భారతీయ జనతా పార్టీ
మజ్లిస్ పార్టీ
సి పి ఐ పార్టీ
సి పి.ఐ (యమ్)

.3 అనుబంధ సంస్థలు

.6 ఎన్నికలు

5 అంతర్జాతీయ వలస

స్వదేశీయులు విదేశాలలోకి విదేశీయులు స్వదేశాలలోకి వలసలు

26 బానిసత్వం - విముక్తి

బానిసల పోరాటం — జి రామారావు

27 అంతర్జాతీయ సంబంధాలు

.1 అంతర్జాతీయ సంబంధాలపై సాధారణ విషయాలు

.11 అంతర్జాతీయ రాజకీయాలు

విదేశ విధాన లక్ష్యాలను సాధించడానికి యంత్రాంగం, యుక్తులు

.12 గూఢచారులు

.16 అంతర్జాతీయ వివాదాలు

.17 అంతర్జాతీయ సహకారం

.2 అంతర్జాతీయ సంబంధాలు నిర్వహించే నేర్పు (డిప్లమసి)

.3-.9 నిర్దిష్ట దేశాల మధ్య విదేశీ విధానాలు

విదేశీ సంబంధాలు. (1) విదేశీ విధాన మూల సంఖ్య 327కి ప్రాదేశిక విభాగం 2వ పట్టిక నుంచి చేర్చాలి. 327 + − 54 = 327.54 భారత వైదేశిక విధానం, (2) రెండు దేశాల అంత

ర్జాతీయ సంబంధాలు తెలుసుకోవాలంటే రెండు ప్రాదేశిక విభాగాల మధ్య సున్న చేర్చాలి. 327.540 42 భారత — బ్రిటన్ అంతర్జాతీయ సంబంధాలు. ఇందు తొలి సంకేతం స్వదేశానికివ్వాలి. రెండు విదేశాల మధ్య అంతర్జాతీయ సంబంధాలు వ్యక్తీకరించేటప్పుడు ప్రాంతీయ సంకేత శ్రేణిలో ముందుగా వచ్చే దేశాన్ని ముందుగా తెల్పాలి

328 శాసన విధానం

.1 పార్లమెంటరీ నిబంధనలు, కార్య విధానం

.4.9 ఆధునిక ప్రపంచంలో శాసన సభలు-భౌగోళిక విభజన

గమనిక: ప్రాదేశిక సంకేతాన్ని(4–9) 2వ పట్టిక నుంచి మూల సంఖ్య 328కి చేర్చాలి

.41 బ్రిటీషు పార్లమెంటు

.54 భారత పార్లమెంటు

మన పార్లమెంటు — మాడ భూషి అనంత శయనం అయ్యంగార్

.548 4 ఆంధ్ర ప్రదేశ్ శాసన సభ (అసెంబ్లి)

మన శాసన సభలు-మామిడి పూడి వెంకట రంగయ్య

330 ఆర్థిక శాస్త్రం

ఆర్థిక విజ్ఞానం—వి వి నరసింహరావు. 330.954 భారత అర్థ శాస్త్రము. కౌటిల్యుని అర్థశాస్త్రం — మామిడిపూడి వెంకట రంగయ్య

330.9 ఆర్థిక పరిస్థితులు

330.91–.99 ఆర్థిక భూగోళ శాస్త్రం (ఇకానమిక్ జాగ్రఫీ)

గమనిక: మూల సంఖ్య 330.9కి ప్రాదేశిక సంకేతాన్ని (1–9) 2వ పట్టిక నుంచి చేర్చవచ్చు

330.954 భారత భూగోళ శాస్త్రం

331 కార్మిక అర్థశాస్త్రం

331.88 ట్రేడ్ యూనియన్లు

ట్రేడ్ యూనియన్లు: వలస విధాన అంత్యదశ— శ్రీపాద అమృత డాంగే.అను: కంభంపాటి సత్యనారాయణ

332 పెట్టుబడి

.1 బ్యాంకులు

బ్యాంకులు జాతీయం చేయడం గురించి ప్రధాన మంత్రి— పబ్లికేషన్స్ డివిజన్

332.11 కేంద్రీయ బ్యాంకులు

రిజర్వు బ్యాంకు—దాని విధులు కార్య కలాపములు — బి సర్వేశ్వరరావు

332.4 డబ్బు, బంగారం, వెండి, నోట్లవంటి మారకాలు మొ.

.45 విదేశీ మారకం (ఫారిన్ ఎక్స్చేంజ్)

333 భూస్వామ్యం

జమీందారీలు— గొర్రెపాటి వెంకట సుబ్బయ్య

333.31 భూసంస్కరణలు

భూకమతాల గరిష్ట పరిమితి—భూస్వాముల వాదనలు —చలసాని వాసుదేవరావు

333.333 భూదానం

334 సహకారం

సహకారోద్యమం—రవీంద్రుని ప్రశంస (పబ్లికేషన్స్ డివిజన్)

335 సామ్యవాదం (సోషలిజం)

సోషలిజం — అశోక్ మెహతా

335.4 మార్క్సిజం

మార్క్స్ ఆర్థిక మూల సూత్రాలు—లియోంటివ్

336 ప్రభుత్వ ద్రవ్యం

336.5484 ఆంధ్రప్రదేశ్ ద్రవ్యస్థితి-వావిలాల గోపాలకృష్ణయ్య

336.2 పన్నులు

పన్నులు—కోలవెన్ను రామకోటేశ్వరరావు. ఆంధ్రప్రదేశ్ అమ్మకపు పన్ను చట్టము—వుత్పల సత్యనారాయణ

336.24 ఆదాయపు పన్ను

338 ఉత్పత్తి

మానవ అవసరాలకు తగిన వస్తువుల తయారీకి సంబందించిన విజ్ఞానం

338.1 వ్యవసాయ ఉత్పత్తులు

పంటభూముల నుండి ఇతోధిక ఫలసాయం (పబ్లికేషన్స డివిజన్)

338.2 లోహాల ఉత్పత్తులు

338.3 పారిశ్రామిక ఉత్పత్తులు

338.5 సూక్ష్మ ఆర్థిక విశ్లేషణము (మైక్రో ఇకనమిక్స)

338.634 చిన్న పరిశ్రమలు

కుటీర పరిశ్రమలు — కె వి సత్యనారాయణ శర్మ

339 జాతీయ ఆర్థికాలు

స్థూల ఆర్థిక విశ్లేషణము (మ్యాక్రో ఇకనమిక్స)
—తెలుగు ఆకాడమీ

340 న్యాయ శాస్త్రం

మీకు అవసరమైన న్యాయశాస్త్ర పరిచయం
— జి.సి వెంకట సుబ్బారావు

340.03 న్యాయ శాస్త్ర నిఘంటువులు పద కోశాలు

341 అంతర్జాతీయ న్యాయశాస్త్రం

అంతర్జాతీయ ధర్మశాస్త్రం—వల్లూరి సూర్యనారాయణరావు

341.026 6 రెండుదేశాల మధ్య సంధి పత్రాలు

భారతదేశం—పాకిస్తాన్ మధ్య సంధి పత్రాలు. ''సున్న'' ద్వారా రెండు దేశాల మధ్య సంబంధం చూపాలి
341.026 654 054 91

342 రాజ్యంగపు న్యాయశాస్త్రం
342.3-9 వివిధ దేశాల రాజ్యాంగ న్యాయ శాస్త్రాలు

గమనిక: మూల సంఖ్య 342కి, ప్రాదేశిక సంకేతం 3–9ని, 2వ పట్టిక నుంచి చేర్చవచ్చు. 342+-41 = 342.41
బ్రిటీషు రాజ్యాంగ విధానం 342+ –54 = 342.54
భారత రాజ్యాంగం -కాశీనాథుని పూర్ణమల్లి కార్జునుడు

343 పౌరన్యాయ శాస్త్రం

మిలిటరీ, పౌర ఆస్తులు, పన్నులు, పరిశ్రమలు, వ్యాపారం మొదలైన వాటికి సంబంధించింది

344 సాంఘిక న్యాయ శాస్త్రం

కార్మిక న్యాయం, సాంఘిక భీమా, సంక్షేమం, ప్రజారోగ్యం, విద్య, సంస్కృతి, మతం—మొదలైన వాటికి సంబంధించినవి

345 అపరాధ (క్రిమినల్) న్యాయ శాస్త్రం

దీనికి భౌగోళిక విభాగాలను చేర్చుకోవచ్చు

346 వ్యక్తిగత న్యాయశాస్త్రం

గృహ సంబంధాలు, వివాహం, విడాకులు, ఆస్తులు, వారసత్వాలు, సంఘాలు, వ్యాపారం, బ్యాంకులకు సంబంధించినవి

347 సివిల్ చట్టాలు

దీనికి ప్రాదేశిక విభాగాలు చెర్చుకోవచ్చు

348 చట్టాలు, నియమాలు, కేసులు

దీనికి ప్రాదేశిక విభాగాలను చేర్చుకోవచ్చు

350 ప్రభుత్వ పాలన (పబ్లిక్ అడ్మినిష్ట్రేషన్)

ప్రభుత్వపాలనా శాస్త్రము — పరిచయము — ఎస్ పి రంగారావు, వి మాధవరావు, ప్రభుత్వ యంత్రాంగ నిర్వహణ. దాని కార్యకలాపాలు, పరిపాలనా వికేంద్రీకరణము — గుమ్మడిదల వెంకట సుబ్బారావు

351 కేంద్ర ప్రభుత్వం

జాతీయ, కేంద్ర ప్రభుత్వాలను ఇచట వర్గీకరించాలి

352 స్థానిక ప్రభుత్వాలు

ఇచట డ్యూయీ ఏర్పరచిన సంకేతాలను స్థానిక అవసరాల కోసం కొంత విస్తృతీకరణ జరిగింది

352.001 జిల్లా ప్రజా పరిషత్తు

ఆంధ్ర ప్రదేశ్ మండల ప్రజా పరిషత్తు, జిల్లా పరిషత్తుల చట్టము

352.002 మండల ప్రజాపరిషత్తు

352.003 పంచాయతీ

పంచాయతీ పరిపాలనము — కె విశ్వనాథం

352.004 నగరపాలక సంస్థ (మునిసిపల్ కార్పొరేషన్)

352.005 పురపాలక సంఘం (మునిసిపల్ కౌన్సిల్)

352.006 జిల్లా గ్రంథాలయ సంస్థ

353 అమెరికా-కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు

అమెరికా ప్రభుత్వం

355 మిలిటరీ నిర్వహణ-యుద్ధ తంత్రం

356 పదాతి దళం, యుద్ధం

360 సాంఘిక సమస్యలు, సేవ

360.15 సంఘ సంక్షేమము: శాస్త్రీయ పద్ధతులు—పి సంజీవ దీక్షిత్, డి నరసింహరాజు. ఇచట ప్రామాణిక ఉప విభాగం చేర్చాలి

361 సాంఘిక సమస్యలు, సాంఘిక సంక్షేమం

361.2 సాంఘిక చర్య

సర్వోదయం — మహాత్మా గాంధీ

364 నేరాలు

నేరాలు నిరోధం — పరిశోధన — అను : బద్దెపూడి రాధాకృష్ణ మూర్తి. నేరస్తులు – వారి స్థితిగతులు — ఏ ఎం సోమసుందరం

365 జైళ్ళు

జైళ్ళ సంస్కరణలు జి వి సుబ్బారావు

367 సాంఘిక సాధారణ క్లబ్బులు

368 భీమా (ఇన్సూరెన్సు)

జీవిత భీమా వస్తువుల, కార్ల మొదలగు వాటి భీమా

370 విద్య

విద్య — హెర్బర్ట్ స్పెన్సర్ — అను: ఖండవల్లి బాలేందు శేఖరం

370.15 మనస్తత్వ శాస్త్రం

విద్యా మనస త్వ శాస్త్రము మరియు శిశు స్వభావము—ఎం డి పాల్ అను: ఎం ఎ సోమయాజులు, అవధాని రమేశ్

370.25 దర్శినులు

విద్యాదర్శిని — బి యస్ మూర్తి. ఇచట 025 ప్రామాణిక ఉప విభాగం

370.73 విద్యాబోధనా సంస్థలు

ప్రాచీన భారత విద్యా పీఠములు — చిలుకూరి నారాయణరావు

371 విద్యకు సంబంధించిన సాధారణాంశాలు

క్రమశిక్షణ — ఉపాధ్యాయులు — విద్యార్థులు – ఆకురాతి చలమయ్య

371.102 బోధన

తెలుగు బోధనా పద్ధతులు — చింతా దీక్షితులు

371.4 మార్గదర్శకత్వం, సలహాలు (నియత, అనియత విద్యలు)

బేసిక్ విద్యా మార్గదర్శి — ఆవంచ లక్ష్మణరావు

372 ప్రాథమిక విద్య

ఎలిమెంటరీ విద్యా ప్రణాళిక — జి రామారావు

373 సెకండరీ విద్య

ఆంధ్రప్రదేశ్‌లో సెకండరీ విద్య

374 వయోజన విద్య

వయోజన విద్య బోధనా క్రమము — గాడిచర్ల హరిసర్వోత్తమరావు
= 374.02

375 పాఠ్య ప్రణాళికలు

ప్రాథమిక సెకండరీ విద్యా సిలబస్ – (వెంకట్రామా అండ్ కో)

376 స్త్రీ విద్య

మహిళలకు అవసరమైన ప్రత్యేక విద్య

377 పాఠశాలలు, మతం

విద్యకు మతానికి ఉన్న సంబంధాలు

378 ఉన్నత విద్య

కళాశాలలు, విశ్వవిద్యాలయాలకు సంబంధించినది

379 విద్య, ప్రభుత్వం

కొఠారీ కమీషన్ సూచనలు — ఎం వి రాజగోపాల్

380 వాణిజ్యం (కామర్స్)

కమ్యూనికేషన్లు, రవాణా (ట్రాన్స్‌పోర్టేషన్)

.1 వాణిజ్యం

వాణిజ్య శాస్త్రము — ప్రాథమిక సూత్రాలు — తెలుగు అకాడమీ

.13 వాణిజ్య విధానం

.14 నిర్దిష్ట ఉత్పత్తులు, సేవలు

.141 వ్యవసాయోత్పత్తులు

.142 ఖనిజాల ఉత్పత్తులు

.143 ఇతర పరిశ్రమల ఉత్పత్తులు

.3 కమ్యూనికేషన్లు

.5 రవాణా

(ట్రాన్స్‌పోర్టు) — తెలుగు అకాడమీ

381 స్వదేశీ వాణిజ్యం

దేశీయ వాణిజ్యంలో మార్పులు

382 అంతర్జాతీయ వాణిజ్యం

విదేశీ వాణిజ్యము (పబ్లికేషన్స్ డివిజన్)

.6 ఎగుమతులు

.7 టారిఫ్ విధానం

383 పోస్టల్ కమ్యూనికేషన్

పోస్ట్ ద్వారా రవాణా సౌకర్యం

384 ఇతర కమ్యూనికేషన్ విధానాలు, టెలి కమ్యూనికేషన్

టెలిగ్రాఫీ, టెలిఫోన్, వైర్లెస్ ద్వారా రవాణా సౌకర్యం

385 రైలు రోడ్ రవాణా సౌకర్యాలు

రైలు కథ — వేమరాజు భానుమూర్తి

386 దేశీయ జల రవాణా సౌకర్యాలు

నీటిపై రవాణా సౌకర్యం

387 నీరు, గాలి, ఆకాశం ద్వారా రవాణా సౌకర్యం

.1 పోర్టులు

.2 ఓడల ద్వారా రవాణా

.7 విమానాల ద్వారా రవాణా

388 భూమార్గ రవాణా సౌకర్యము

389 తూనికలు, ప్రామాణీకరణ

.1 వాతావరణ శాస్త్రం

.6 ప్రామాణీకరణ

390 ఆచారాలు, మర్యాదలు, జానపద విజ్ఞానం

391 దుస్తులు

.1 పురుషుల దుస్తులు

.2 స్త్రీల దుస్తులు

.3 పిల్లల దుస్తులు

.5 కేశాలంకరణ

.7 నగలు

392 ఆచారాలు

జీవితానికి, గృహానికి సంబంధించినవి. బాల్యం, యౌవనం, కౌమారం, వివాహం, స్త్రీపురుష సంబంధాలు

393 మృత సంబంధ ఆచారాలు

మృత కర్మలు — సి గంగాధరశర్మ

394 సాధారణ ఆచారాలు

తినడం, త్రాగడం, పొగ పీల్చడం, సెలవుల వినోదం, పండుగలు— పబ్బాలు, ఆటలు, సంతలు, వేడుకలు, వీరోచిత కృత్యాలు

హిందువుల పండుగలు పర్వములు— తిరుమల రామచంద్ర

395 మర్యాద

మాట మన్నన — గొర్రెపాటి వెంకట సుబ్బయ్య

398 జానపద విజ్ఞానం

.04 సాధారణంలో ప్రత్యేకం

.042 జానపద సామాజిక శాస్త్రం

విమర్శ, జానపదాల పుట్టు పూర్వోత్తరాలు, వాటి స్వభావం, సాంస్కృతికంగా దాని అవసరం, వాటిపైగల విమర్శలను ఇచట వర్గీకరించాలి

.1 జానపదాల తాలూకు నిర్దిష్ట సిద్ధాంతాలు

.2 జానపద సాహిత్యం

సాహిత్య ప్రశంస, విమర్శలను ఇచట వర్గీకరించాలి. తెలుగు జానపద గేయ సాహిత్యం — బిరుదురాజు రామరాజు

.21 జానపద కథలు

దేశ దేశాల జానపద కథలు — సంపా: సావిత్రి దేవి వర్మ

.41 జానపదుల నమ్మకాలు

.6 పొడుపు కథలు

గోడమీద బొమ్మ - వెలగా వెంకటప్పయ్య

.8 జానపద గేయాలు

పల్లెపదాలు - సంపా: కృష్ణశ్రీ; జానపద గేయాలు — సంపా ఎల్లోరా

398.9 సామెతలు

దీనికి భాషా సంకేతాలను 6వ పట్టిక నుంచి చేర్చుకోవచ్చు 398.9+—94827 = 398.994 827 తెలుగుసామెతః ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

గమనిక: ఎలాగూ తెలుగు పుస్తకాలు తెలుగు విభాగాలలోనే ఉంటాయిగనుక తెలుగు సామెతలకు 398.9 సంకేతంతోనే సరిపెట్టుకోవచ్చు

399 యుద్ధ, రాజనీతి తంత్రజ్ఞత ఆచారాలు

నృత్యాలు, సంగీతం, ఖైదీలను బంధించుట, వారిని ఆదరించుట

— 0 —

# 18 400 భాషా శాస్త్రం

పరస్పర అవగాహనకు ఉపకరించేది భాష. భావాన్ని అందం పెట్టేది సాహిత్యం. భాషా సాహిత్యాలు అవినాభావ సంబంధం గలవి. భాష ముడి సరుకు అయితే సాహిత్యం తీర్చి దిద్దిన పుత్తడి బొమ్మ అవుతుంది. ఈ రెంటినీ వేరు చేయవలసిన అవసరం లేదు. కాని డ్యూయీ తాత్విక బద్ధమైన ఒక విధానాన్ని అనుసరించడం వలన దశాంశ వర్గీకరణ పథకంలో ఈ విభజన తప్పనిసరి అయింది.

**భాషలు**

ఇంతకు ముందు అధ్యాయాలలో దాదాపు అన్ని భాషలకు అన్వయించే ఉప విభాగాలు లేదా భాషా ప్రక్రియలు ఇచ్చాము. *11*వ, అధ్యాయంలో ప్రపంచంలోని ముఖ్యమైన భాషల పట్టిక ఉంది. స్థూలంగా చెప్పాలంటే ఆ రెండు అధ్యాయాలను జతపరిస్తే ఈ అధ్యాయం ఏర్పడుతుంది. ఈ వర్గంలో తొలి సంకేతం 4 ఉంటుంది. దాని ప్రక్కన భాషా సంకేతాన్ని - తర్వాత భాషా ఉప విభాగాన్ని చేర్చాలి. అన్నీ కలిస్తే భాషా సంకేతం ఏర్పడుతుంది.

భాషా వర్గంలో సంకేతం ఈ దిగువ చూపిన క్రమంలో ఉంటుంది.

| వ సం | విషయం | సంకేతం | సంకేత క్రమం |
|---|---|---|---|
| 1 | భాషలు | 400 | 4 |
| 2 | ఇంగ్లీషు భాష | ___2 | 42 |
| 3 | నిఘంటువు | ___3 | 423 |

గమనిక : ప్రామాణిక ఉప విభాగాలలో గల -03 నిఘంటువుల సంకేతం చేర్చి 420.3 అనడం సరికాదు. భాషా సంబంధ నిఘంటువులకు -3 (4వ పట్టిక నుంచి) మాత్రమే చేర్చాలి.

2 అవసరమని భావిస్తే ప్రామాణిక ఉప విభాగాలను చేర్చుకోవచ్చు.

| | |
|---|---|
| 494.827 | తెలుగు భాష |
| -05 | పత్రిక |
| 494.827 05 | తెలుగు భాషపై పత్రిక |

3 ఇలాగే 6వ, పట్టికలో ఇచ్చిన భాషలకు అవసరాన్ని బట్టి తొలుత 4వ, పట్టికలోని భాగాలను, తదుపరి ఇతర పట్టికలలోని భాగాలను చేర్చుకోవచ్చు.

## తెలుగు సంకేతాలు

చాలా కాలంగా తెలుగు భాషకు 494.813 సంకేతం ఉంది. 17వ, సంస్కరణ నుంచీ ఇది 494.827 గా మార్పు జరిగింది.

ప్రస్తుత సంస్కరణలో గూడ అదే సంకేతం కొనసాగింది. ఈ సంకేతానికి భాషా సాహిత్య ఉప విభాగాలు, ప్రామాణిక ఉప విభాగాలు, మొదలైన ఉప విభాగాలు చేర్చినపుడు దీని సంకేతం పెరుగుతుంది. ఒక్కొక్కప్పుడు పుస్తకం వెన్నుమీద సంకేతం వేయడం కష్టమే అవుతుంది. అందుచేత సుదీర్ఘమైన తెలుగు సంకేతం 494.827 కి బదులు "తె భా" గానూ, 894.827కి బదులు "తె సా" గానూ మార్పుచేయ వచ్చు. ఈ మార్పు ఐచ్ఛికం.

ఈ దిగువ ఇంగ్లీషు, తెలుగు భాషలలోని ఉప విభాగాలు, వాటికి అన్వయించే ప్రామాణిక ఉప విభాగాలు సూచన ప్రాయంగా ఇవ్వడం జరిగింది. దీనిని బట్టి మిగతా భాషలను ఊహించుకోవచ్చు.

## కొన్ని విశేషాలు

| వ సం | మూాల వర్గ సంఖ్య | చేర్చదగింది | ఆధారం |
|---|---|---|---|
| 1 | 4 భాషా వర్గం | భాషా సంఖ్య | 6వ, ప |
| 2 | 409 భాషా చరిత్ర | 1 - 9 | 2వ, ప |
| 3 | 410 అమెరికన్ భాష | 01 - 86 | 4వ, ప |
| 4 | 427.1-.8 ఇంగ్లండులో ప్రయోగాలు | 421-428లో 42 కు పిదప సంఖ్యలు | 2వ, ప |
| 5 | 427.9 ఇతర ప్రదేశాలలో ప్రాంతీయ తేడాలు | 4 - 9 | 2వ, ప |
| 6 | 437.1-.6 జర్మన్ ప్రాంతీయ ప్రయోగాలు | 431-436లో 43 పిదప సంఖ్యలు | 2వ, ప |
| 7 | 437.9 ఇతర ప్రాంతీయ ప్రయోగాలు | 4 - 9 | 2వ, ప |
| 8 | 494.1-.3 అట్లాంటిక్ భాషలు | 941-943 లో 94 పిదప సంఖ్యలు | 6వ, ప |
| 9 | 418 వినియోగం | 001-009 | 1వ, ప |
| 10 | 427 అప్రమాణిక ఆంగ్లభాష | 001-009 | 1వ, ప |
| 11 | 430 జర్మన్ భాష | 001-009 | 1వ, ప |
| 12 | 437 అప్రమాణిక జర్మన్-భాష | 001-009 | 1వ, ప |
| 13 | 491.43 హిందీ భాష | 001-009 | 1వ, ప |
| 14 | 491.7 రష్యన్ భాష | 001-009 | 1వ, ప |
| 15 | 491.4 టిబెటిన్ భాషలు | 001-009 | 1వ, ప |

**అనుసూచి**

400 భాష

భాషలకు సంబంధించిన సమగ్ర గ్రంథాలు ఇచట చేర్చాలి. 01–09 ప్రామాణిక ఉప విభాగాలు మూలసంఖ్య 4కు చేర్చుకోవచ్చు

409 బాషాచరిత్ర

ప్రాదేశిక విభాగాలను 409 పిదప చేర్చాలి. 409.54 భారతీయ భాషల చరిత. నిర్దిష్ట భాషలకు సంబంధించిన చరిత్ర 420–490 లో వర్గీకరించాలి

410 ఆధునిక భాషా శాస్త్రం

మాట్లాడే, రాసే బాషల శాస్త్రం వాటి నిర్మాణం. ఇండో, యూరోపియన్ భాషలపై సమగ్ర గ్రంథాలు ఇచట వర్గీకరించాలి

411 సంకేతాలు (లిపులు, గుర్తులు)

412 భాషోత్పత్తి, భాషా రూపాలు

413 పలు భాషల నిఘంటువులు

భారతీయ వ్యవహార కోశ్ – విశ్వనాథ్ దినకర్ నరవాణ

.028 నిఘంటు నిర్మాణ పద్ధతి

.1 ప్రత్యేక నిఘంటువులు

సంక్షిప్తాలు, పొడి అక్షరాల మాటల నిఘంటువులు

414 ధ్వని శాస్త్రం

415 వ్యాకరణం

చందస్సు, అలంకార శాస్త్ర గ్రంథాలను 808.1లో వర్గీకరించాలి

417 పద ప్రయోగ శాస్త్రం

.2 మాండలిక ప్రయోగ శాస్త్రం

.7 తొలి రచనల అధ్యయన

418 ఆధునిక భాషా శాస్త్ర ప్రయోగం

001–009 ప్రామాణిక ఉప విభాగాలు

.02 అనువాదం, వ్యాఖ్యానం

419 రాత, మాటలేని భాష

420-490 నిర్దిష్ట భాషలు

నిర్దిష్ట భాషల సమగ్ర గ్రంథాలను ఇచట వర్గీకరించాలి. 400 వర్గానికి 11వ, అధ్యాయంలోని భాషలు చేర్చితే బాషా సంకేతాలు ఏర్పడతాయి. 400+-21 (ఇంగ్లీషు) = 421 ఇంగ్లీషుభాష

420 ఇంగ్లీషు, ఆంగ్లో శాక్షన్ భాషలు

42 మూల వర్గ సంఖ్యకు 4వ, పట్టికలోని విభాగాలు చేర్చవచ్చు

421 రాసే, మాట్లాడే భాష

422 భాషోత్పత్తి

423 ప్రామాణిక ఇంగ్లీషు నిఘంటువులు

ఆక్స్‌ఫర్డు ఇంగ్లీషు నిఘంటువు

.31 ప్రత్యేక నిఘంటువులు

సంక్షిప్తాలు, పొడిమాటలు, వ్యతిరేకార్థకాలు, సమానార్థకాలు

.32 ద్విభాషా నిఘంటువులు

443.21 ఇంగ్లీషు ఫ్రెంచి నిఘంటువు

గమనిక: ఏ భాషలో ఎక్కువ ఉపయోగంలో ఉంటుందో ఆ భాషలో ద్విభాషా నిఘంటువులు చేర్చాలి

425 ఇంగ్లీషు ప్రామాణిక భాష—వ్యాకరణం

427 ఇంగ్లీషు అప్రమాణిక భాష — వర్ణన, విశ్లేషణ ప్రయోగం, నిఘంటువులు

0001-0009 ప్రామాణిక ఉప విభాగాలు

.1-.8 ఇంగ్లండ్‌లో మాండలికాల వినియోగం

దీనికి ఉప విభాగాల 2వ పట్టికలో 42 పిదప 421 నుంచి 428 వరకు చేర్చవచ్చు. 427.9 వేల్సులో ఇంగ్లీషు మాండలిక భాష

| | |
|---|---|
| .9 | ఇతర ప్రాంతాలలో మాండలికాల వినియోగం<br>427.9 పిదప ప్రాదేశిక విభాగాల పట్టికలో 4 నుండి 9వరకు చేర్చవచ్చు |
| 428 | ప్రమాణ ఇంగ్లిషు ప్రయోగం |
| 429 | ఆంగ్లో శాగ్జన్ ఇంగ్లిషు<br>గమనిక: 4వ పట్టికలోని విభాగాలు చేర్చవచ్చు |
| 430 | జర్మన్ |
| 440 | ఫ్రెంచి |
| 459 | ఇటాలియన్,రొమేనియన్ |
| 460 | స్పానిష్, పోర్చుగీసు |
| 470 | లాటిన్ |
| 480 | గ్రీకు |
| 490 | ఇతర భాషలు |
| 491.1 | ఇండో ఆర్యన్ భాషలు |
| .2 | సంస్కృతం |
| .37 | పాళి |
| .42 | పంజాబీ |
| .43 | హింది<br>001–009 ప్రామాణిక ఉప విభాగాలు |
| .44 | బెంగాలి |
| .45 | అస్సామీ |
| .46 | మరాఠి |
| .47 | గుజరాతీ, రాజస్థానీ |
| .7 | రష్యన్ |
| 492 | ఆఫ్రో, ఆసియాటిన్ భాష |

7 అరబిక్

4 ఆర్చాయిక్ ద్రావిడ భాషలు

.8 ద్రావిడ భాషలు

.811 తమిళం

.812 మళయాళం

.814 కన్నడం

4.827 తెలుగు భాష (తె భా)

494.827 09 ఆంధ్ర భాషా చరిత్ర — చిలుకూరి నారాయణ రావు

.827 1 తెలుగు లిపి

లిపి పుట్టు పూర్వోత్తరాలు — తిరుమల రామచంద్ర

.827 2 తెలుగు భాష—వ్యుత్పత్తి

భాషోత్పత్తి — భాషా క్రమము — కోరాడ రామకృష్ణయ్య

.827 3 తెలుగు నిఘంటువులు

శబ్ద రత్నాకరము — బహుజనపల్లి సీతారామాచార్యులు

.827 31 ప్రత్యేక నిఘంటువులు, సంగ్రహాలు, పొడిమాటలు వ్యతిరేకార్థాలు, సమానార్థకాలు

నానార్థ రత్నమాల — ఇరువగ ఉండ నాధుడు

.827 32—.39 ద్విభాషా నిఘంటువులు

494.827 322 1 బ్రౌన్ తెలుగు-ఇంగ్లీషు నిఘంటువు

421.394 827 బ్రౌన్ ఇంగ్లీషు-తెలుగు నిఘంటువు

.827 5 తెలుగు వ్యాకరణాలు

బాల వ్యాకరణం-పరవస్తు చిన్నయ సూరి

గమనిక : ఛందస్సు, అలంకార శాస్త్రాలు 808.1 లో వర్గీకరించాలి

.827 7 తెలుగు శాసనాలు

ప్రాచీనాంధ్ర శాసనాలు—బూదరాజు రాధాకృష్ణ

494.827 86 తెలుగు వాచకాలు

పెద్ద బాల శిక్ష—పూదూరు సీతారామ శాస్త్రి

## సంకేతంలో మార్పు

తెలుగు భాషకు 494.827 కు బదులు 'తెభా' ఉపయోగించినపుడు సంకేతాల స్వభావం ఇలా ఉంటుంది

తె భా.1 తెలుగు లిపి
తె భా.5 తెలుగు వ్యాకరణం
తె భా.86 తెలుగు వాచకం

494. 83 బ్రాహుయి భాష
495 సినో టిబెట్ భాషలు
496 ఆఫ్రికా భాషలు
497 ఉత్తర అమెరికా భాషలు
498 దక్షిణ అమెరికా భాషలు
499 ఇతర భాషలు

## 19 500 శుద్ధ విజ్ఞాన శాస్త్రాలు

మౌలిక శాస్త్ర విజ్ఞానానికి సంబంధించిన శాస్త్రాలను సామాన్య విజ్ఞాన శాస్త్రాలు లేదా శుద్ధ విజ్ఞాన శాస్త్రాలు (ప్యూర్ సైన్సెస్) అంటారు. పరిశీలన, ప్రయోగంపై ఇవి అభివృద్ధి చెందుతుంటాయి. సాంఖ్యక శాస్త్రం, గణిత శాస్త్రం, భౌతిక రసాయన శాస్త్రాలు, భూ విజ్ఞాన శాస్త్రం, స్ఫటికాలు, జీవ, జంతు శాస్త్రాలు మొదలైనవన్నీ ఈ కోవకు చెందుతాయి, ఇందు శాస్త్రీయ అంశాలే ప్రధానంగా ఉంటాయి.

| వ సంఖ్య | మూల సంఖ్య | చేర్చదగింది | ఆధారం |
|---|---|---|---|
| 1 | 508.3 ప్రాచీన ప్రాంతాలు | 1-3 (508 పిదప సంఖ్యలు) | 2వ, ప |
| 2 | 509.4 నవీన ప్రాంతాలు | 4-9 (508 పిదప సంఖ్యలు) | 2వ, ప |
| 3 | 521.541-.548 నిర్దిష్ట గ్రహాలు | 523.41-523.48 523.4 తదుపరి సంఖ్య521.54 పిదప | అనుసూచి |
| 4 | 530.15 గణిత శాస్త్ర సంబంధ భౌతిక శాస్త్రం | 511-519 (51 తదుపరి సంఖ్య) | అనుసూచి |
| 5 | 546.224 సైద్ధాంతిక రసాయన శాస్త్రం | 541.22-541.28 541.2 పిదప 546.224 మూల సంఖ్య | అనుసూచి |

| వ సంఖ్య | మూలవర్గ సంఖ్య | | చేర్చదగింది | ఆధారం |
|---|---|---|---|---|
| 6 | 550 | భూవిజ్ఞాన శాస్త్రం | 4-9 (55 పిదప) | 2వ. ప |
| 7 | 572 | నిర్దిష్ట జాతులు | 01-09 (572.8 పిదప) | 5వ. ప |
| 8 | 580.744 | వృక్షశాస్త్ర వనాలు | 1-9 | 2వ. ప |
| 9 | 512 | ఆల్జీబ్రా | 001-009 | 1వ. ప |
| 10 | 516 | జామెట్రీ | 001-009 | 1వ. ప |
| 11 | 532 | ద్రవ్య శాస్త్రం | 001-009 | 1వ. ప |
| 12 | 543 | విశ్లేషణాత్మక రసాయన శాస్త్రం | 001-009 | 1వ. ప |
| 13 | 544 | గుణాత్మక రసాయన శాస్త్రం | 001-009 | 1వ. ప |
| 14 | 545 | పరిమాణాత్మక రసాయన శాస్త్రం | 001-009 | 1వ. ప |
| 15 | 547 | కర్బన రసాయన శాస్త్రం | 001-009 | 1వ. ప |
| 16 | 586 | గింజలు లేని మొక్కలు | 001-009 | 1వ. ప |

## అనుసూచి

500 శుద్ధ విజ్ఞాన శాస్త్రాలు

ప్రకృతి శాస్త్రాలు, ప్రకృతి చరిత్ర, శుద్ధ వినియుక్త విజ్ఞాన శాస్త్రాలపై గల సమగ్ర గ్రంథాలను ఇచట వర్గీకరించాలి. ఆయా విషయాలకు సంబంధించిన శాస్త్రీయ విషయాలను ఆ విషయాల వద్దే వర్గీకరించాలి. 769.015 అద్దకాలలో శాస్త్రీయ నియమాలు. ఇందు 015 ప్రామాణిక ఉప విభజన

